# డిసెంబర్ 11న విజయవాడలో ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జరిగిన సాహితీస్రవంతి కార్యశాల దృశ్యాలు


సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'స్వేచ్ఛా స్వరం' ఆవిష్కరణ దృశ్యం

పెనుగొండ లక్ష్మీనారాయణ


కె. ఆనందాచారి


మహ్మద్ ఖదీర్‌బాబు


...సంఘం తరపున అధ్యక్షోపన్యాసం చేస్తున్న ఈమని శివనాగిరెడ్డి


కార్యశాల ప్రారంభసభలో సభాధ్యక్షులు తెలకపల్లి రవి


చీకటి దివాకర్


భావ ప్రకటన స్వేచ్ఛపై ప్రసంగిస్తున్న కొత్తపల్లి రవిబాబు


తెలుగు కథ - ప్రపంచీకరణపై ప్రసంగిస్తున్న రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి


జంధ్యాల రఘుబాబు


ప్రపంచీకరణ కవిత్వంపై ప్రసంగిస్తున్న ప్రొ॥ మేడిపల్లి రవికుమార్






మల్లిపురం జగదీశ్









సాహిత్య ప్రస్థానం
జనవరి 2017
సంపుటి : 16 సంచిక : 1

# అక్టోబరు విప్లవ శతవార్షికోత్సవం

ప్రపంచ చరిత్రనే మార్చిన మహత్తం అక్టోబరు విప్లవ శతవార్షికోత్సవ సంవత్సరం ఇది. పతిత నిర్గతిక ప్రపంచ త్రాతా, వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్య దాతా, అని మహాకవులు కీర్తించిన మహావిప్లవం. పాపపంకం నుంచి పద్మాలు పుట్టించి కార్మికస్వర్గాన్ని కలగన్న రష్యా అని కొనియాడిన మహాశక్తికి మూలం అక్టోబర్ విప్లవం. మానవ చరిత్రలో ఫ్రెంచి విప్లవం, అమెరికన్ విప్లవం, అక్టోబర్ రష్యన్ విప్లవం మూడూ మహత్తరమైన మార్పులు తెచ్చాయి. కాని ఈ మూడింటిలో మళ్లీ మౌలికంగా చరిత్రను మార్చి మరో ప్రపంచానికి నాంది పలికింది అక్టోబర్ విప్లవమే. సమాచార సంబంధాలు ఇంతగా లేని ఆ రోజుల్లోనే సోవియట్ విప్లవం అన్నిదేశాలనూ ఉర్రూతలూపింది. అమృతబజార్ బెంగాలీ పత్రిక రష్యన్ అగ్ని పర్వతం అంటూ అభివర్ణించింది. ఆంధ్ర పత్రిక ఎన్నో కథనాలు ప్రచురించింది. నాకు బొల్షివిజమొక్కటే మార్గంగా కనిపిస్తుందని లాలాలజపతిరాయ్ రాశారు. రచయిత ప్రేమ్‌చంద్ నేనిప్పుడు బొల్షివిక్ సిద్ధాంతాలను పూర్తిగా నమ్ముతున్నాను అన్నారు. ఇదంతా బ్రిటిష్ పాలకులకు కంగారు పుట్టించి 1919 లోనే బొల్షివిక్ భావాలు వ్యాపించకుండా కట్టుదిట్టమైన నిఘాలు నిషేధాలు పెంచారు. 1922లోనే తెలుగునాట ఉన్నవ లక్ష్మీనారాయణ మాలపల్లి నవలలో రష్యా విప్లవం గురించి రాశారు. 1935లో గోర్కీ అమ్మ నవల అనువాదమైంది. విశ్వకవి రవీంద్రనాథటాగూరు వేనోళ్ల కీర్తించారు. సోవియట్ రష్యా భారత దేశంతో సహా నవ స్వతంత్ర దేశాలకు ఆత్మీయ నేస్తంగా అండగా నిలిచింది. భారతీయ భాషలన్నిటా సాహిత్యం, నిస్వార్థ శాస్త్ర వైజ్ఞానిక సహాయం అందించిన ఘనత దానికే దక్కింది. 1991ఆగష్టులో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైంది. అంత మాత్రాన అక్టోబర్ విప్లవ చారిత్రిక ప్రాధాన్యత చెక్కుచెదరదు. ఈ వందేళ్లలోనూ 70 ఏళ్లు అది అద్భుత ప్రభావం చూపింది. కూలిపోయిన తర్వాత పాతికేళ్లలో ప్రపంచం గ్లోబలిపీఠంగా మారడం కనిపిస్తూనే వుంది. చరిత్రాంతం అంటూ సిద్ధాంతాలు చెప్పిన మేధావులు తలలు పట్టుకుంటుంటే మార్క్స్ మళ్లీ ప్రాణం పోసుకుంటున్నాడు. దోపిడీ పీడన అణచివేత వున్నంత కాలం దానికి వ్యతిరేకంగా పోరాటం వుండనే వుంటుంది. ఒక రోగి మరణిస్తే వైద్యశాస్త్రం తప్పుకానట్టే ఒక తొలి విప్లవం గొప్ప ఫలితాల తర్వాత తప్పులతో దెబ్బతింటే ఆ సిద్ధాంతమే తప్పయిపోదు. మారిన పరిస్థితుల్లో ఆ నూతన అధ్యయనానికి ఆచరణకూ అక్టోబర్ విప్లవ శతవార్షికోత్సవం మార్గదర్శి అవుతుందని ఆశిద్దాం. శాపనార్థాలు పెట్టేవారిని పక్కకునెట్టి చారిత్రిక యదార్థతత్వం అన్వేషిద్దాం. ఈ ఏడాది ఆ విప్లవ శతవార్షికోత్సవ సంచికనూ రచనలనూ వెలువరిద్దాం.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...





మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002, సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

-డా॥ సి. నారాయణరెడ్డి

# కిందైనా మీదైనా

కిందైనా మీదైనా పక్షులు ఒక్కటే
అవి నేలమీద
ఎంత నిదానంగా అడుగు లేస్తాయో
నింగిలో అంత నిబ్బరంగా
రెక్కలు సాచి విహరిస్తాయి
పక్షులకున్న ఉభయ పార్శ్వ ప్రావీణ్యం
ప్రణుతి పాత్రం.



మృగాలున్నాయి
అవి ధరాతలం పైన
ప్రేక్షక భయదంగా సాగిపోతుంటాయి
తమ చుట్టూ ప్రమాదాలు కమ్ముకున్నప్పుడు
అవి తప్పించుకుని
పైకెగిరి పోలేవు
బుసలు విసిరే విషధరాలున్నాయి.
పుట్టలో నక్కి వున్నప్పుడు
మట్టిలో నిక్కి చూస్తున్నప్పుడు
వాటి ఉనికి చెల్లుతుంది.
తమపై విసిరిన వలల చిక్కుల్లో నుంచి
బయటపడి అవి
గగనం వైపు ఎగబాకలేవు.

మరి జలచరాల మాటేమిటి?
అవి నీటిని దాటితే అంతే.
అవనిపై అంగుళ దూరం నడిచిపోలేవు.
అంబరం నీడను అందుకోలేవు.
అది పక్షి కదా అని చిన్నచూపు చూడొద్దు.
ఇటైనా అటైనా దాని సామర్థ్యం
అసాధారణం.
పరిణత మేధా సంపన్నులైన
నరోత్తములకు కూడా
పక్షి ఆదర్శప్రాయం.

❋



## సెప్టెంబర్ నెల పురస్కారాలు



**మేలుకొలుపు**
కథకు: రూ.700/-
రచయిత : మీనాక్షి శ్రీనివాస్

**మూన వస్త్రం**
కవితకు : రూ .500/-
రచయిత : అశోక్ అవారి

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్


సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి!
తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 120/-
5 సంవత్సరాల చందా రూ.500 /-
10 సంవత్సరాల చందా రూ. 1000/-
Bank Details: SBH, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBHY0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

రచనలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు
ఈ దిగువ చిరునామాకు పంపగలరు
సాహిత్య ప్రస్థానం
27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు
ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002
ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com



- పక్కి రవీంద్రనాథ్
9440364486

# అలజడి

"అయ్యా! సోములు మామ అవుపడ్డం నేదు,నానూ చింతల్లీ కాల్లరిగిపోయినట్టుగ తిరిగినాము గానీ ఎక్కడా అవుపడనేదు." బడి ముందు జెండా దిమ్మ మీద కూర్చున్న సత్యం నాయుడితో కొడుకు సింహాచలం ఆందోళనగా చెప్పాడు.

"ఆడెక్కడికెలిపోతాడ్రా... అయితే ఇల్లు, నేకపోతే కల్లం. ఉదయం బట్టి నానూ సూడనేదు. ఆల సీనుగాడింటికి ఎల్లినాడేటో ఓపాలి పోను సెయ్యుమీ... అయినా నాతోటి సెప్పకుండా నేస్తం ఎక్కడికీ ఎల్లడే" అంటూ లాల్చీ జేబులోని ఓ చిన్న పుస్తకాన్ని తీసి అందులోని ఒక నంబరు చూపించాడు సత్యం నాయుడు.

ఊరి జనమంతా బడిలోనే తలదాచుకుంటుండడంతో అక్కడంతా గోలగా వుంది. తండ్రి చేతిలోని పుస్తకాన్నందుకున్న సింహాచలం ఫోను చేసే పనిమీద బడినుంచి దూరంగా వెళ్ళాడు.

ఆకాశం నిండా మబ్బులు నల్లగా కమ్ముకుని వున్నాయి. అక్కడికి దక్షిణాన ప్రవహిస్తున్న నాగావళి పరవళ్ళ హోరు జనం గోలను సవాలు చేస్తున్నట్టుంది. ఉండుండీ ఈదురు గాలులు వీస్తున్నాయి. రాత్రికి భారీగా వర్షం కురిసే సూచనలు కనిపిస్తున్నాయి. చీకటి పూర్తిగా పడక ముందే ఆడవాళ్ళంతా బడి గ్రౌండులో వంట పూర్తి కానిచ్చి పాత్రలతో బడిలోకి పోతున్నారు. తమకిదేమీ పట్టనట్టు పిల్లలు ఆటల్లో మునిగి పోయారు.

ఊరికి దగ్గరలోనే నాగావళి నది ప్రవహిస్తున్నా అది ఏనాడూ గ్రామంలోకి అడుగు పెట్టింది లేదు. గత రెండేళ్ళ గా ఆ ఊరి దిగువున బ్యారేజీ నిర్మాణాన్ని ప్రారంభించిన ప్రభుత్వం ఆ గ్రామాన్ని 'ముంపు' గ్రామంగా ప్రకటించింది. బ్యారేజీ నిర్మాణం మీద చూపిస్తున్న శ్రద్ధలో పదోవంతు కూడా నీటిలో మునిగిపోతున్న నిర్వాసిత గ్రామాల ప్రజల పునరావాసం పైన ప్రభుత్వం చూపించడం లేదు. దీనితో ముంపు గ్రామాల ప్రజల కష్టాలు వర్ణనాతీతంగా తయారయ్యాయి. చినుకు చిటుక్కుమంటే చాలు... ముందస్తు జాగ్రత్తగా గ్రామస్తులందరినీ పక్కనే వున్న బడి భవనాలలోకి తోలుకు పోవడం రెవెన్యూ అధికారులకు అలవాటుగా మారింది.

"అక్కడికీ ఎల్లనేదటరయ్యా.. శీను బావ రేపు యమకల

పేసింజరు బండికి వస్తానన్నాడు. "ఫోను నంబర్ల పుస్తకాన్ని తిరిగి తండ్రి చేతికిస్తూ చెప్పాడు సింహాచలం.



'ఇదేట్రా... ఈడెటెలిపోనాడ్రా... అటు కొడుకు దెగ్గిటికెల్లకా, ఇక్కడా నేకా నేస్తం ఎటెల్లిపోయినట్టిగ? అసలే దివాలగున్నాడు. మూడు రోజుల బట్టి జొరం. నిన్న నానే మన ఆచారిని ఇంటికి తీసికెల్లి ఇంజిక్షను ఇప్పించినాను' సత్యంనాయుడు తనలో అనుకుంటూ ...“ బావూ సిమ్మాచలమూ... కల్లంకాసెల్లి సూసినారా?" అడిగాడు.

"ఊరుకోరయ్యా, కల్లాల్లోన ఇప్పుడెవులుంతారు? అక్కడిప్పుడు మామూలు మామూలుగ్గట్టా నేదు. నడుంలోతు నీరుంది.," జవాబిచ్చేడు సింహాచలం.

చుట్టూ నెమ్మదిగా చీకటి కమ్ముకుంటున్నది. పనులు తొందరగా చక్కబెట్టుకునే ఉద్దేశ్యంతో కొందరు ఆడవాళ్ళు తమ పిల్లలకు గిన్నెల్లో కలిపి అన్నం తినిపిస్తున్నారు.

సత్యంనాయుడు జేబులోంచి చుట్ట తీసి వెలిగించేడు.

స్నేహితుని ఆచూకీ తెలియక పోవడంతో అతనికి ఆందోళనగా వుంది.

చుట్ట కాలుస్తూ ఆలోచనలో పడ్డాడు.

ఊళ్ళో సోమినాయుడికి తాను తప్ప అయిన వాళ్ళెవరూ లేరు. తమ స్నేహం ఈనాటిది కాదు. సోమినాయుడికి ఒక్కడే కొడుకు. పేరు శ్రీను. భార్య ఎల్లమ్మ. ఆవెకు తోబుట్టువులెవరూ లేరు. తనను స్వంత అన్నలా భావించి ఆదరించేది. సోమినాయుడు దంపతులది చూడముచ్చటైన జంట. ఎంతో అన్యోన్యమైన దాంపత్యం. ఎక్కడికెళ్ళినా ఆది దంపతుల్లాగా ఇద్దరూ కలిసే వెళ్ళేవారు. ఆ వూర్లో ఏ మంచి పనయినా ముందు ఎల్లమ్మనే పిలిచేవారు. పెళ్లి పనులు మొదలుపెట్టాలన్నా, కొత్తకోడలికి గాజులెక్కించాలన్నా, గాదిలో ధాన్యం గింజల వాడకం మొదలు పెట్టాలన్నా, కొత్తగా కొనుక్కున్న బీరువా లాంటి వస్తువులు ప్రారంభించాలన్నా ఎల్లమ్మ అక్కడ వుండాల్సిందే. ఆమె చేయి మంచిదని ఆ వూర్లో అందరికీ అంత నమ్మకం.

భార్య కోరిక మీద తామున్న పెంకుటిల్లు స్థానంలో డాబా ఇల్లు కట్టించేడు సోమినాయుడు. ఇంటి కోసం చేసిన అప్పు తలకు మించిపోయినా ఇంటి నిండా వేసిన రంగుల ముగ్గులు భార్య ముఖంలో నవ్వుతూ కనిపించేసరికి ఆనందంతో మురిసిపోయేవాడు. పొలం లేకపోయినా బక్కలు కాసో, బదవ చేసో ఎలాగోలా బతికేయగలనని తనకు తానే ధైర్యం చెప్పుకునేవాడు.

కొడుక్కి పెళ్ళి చేసిన తరువాత కొత్త కోడలు ఇంట్లో అటూ ఇటూ కలివిడిగా తిరుగుతుంటే ఆ దంపతులిద్దరూ పొంగిపోయేవారు.

కొడుక్కి పెళ్ళయి ఏడాది తిరక్కుండానే ఎల్లమ్మకు జబ్బు చేసింది. ఇంట్లో వున్న నగా నట్రాతో పాటు అతనికొచ్చిన పరిహారం డబ్బులు కూడా ఆమె వైద్యం కోసం హరాయించుకుపోయాయి. అయినా ఫలితం లేకపోయింది. ఎల్లమ్మ మరణం సోమినాయుణ్ణి బాగా కుంగదీసింది. భార్య కర్మ కాండ ఉన్నంతలో ఘనంగా చేసాడు. భార్య చనిపోయిన చాన్నాళ్లకు సోమినాయుడి కలలో ఎల్లమ్మ కనిపించి తనకు వూరికి ఉత్తరంగా వున్న కళ్లంలో గుండం కట్టించమని చెప్పింది. సోమినాయుడి చేతిలో సొమ్ము లేకపోయినా అప్పు చేసి గుండం కట్టించి ఊర్లో అందరికీ అక్కడే భోజనాలు పెట్టించాడు. అప్పటి నుంచీ ఎల్లమ్మ పేరంటాలుగా వూర్లో అందరి పూజలందుకుంటోంది. ఆమెను మొక్కుకుంటే అనుకున్న పనులు అనుకున్నట్టు జరుగుతాయని చాలామంది నమ్ముతున్నారు. తల్లి మరణం తరువాత కొడుకు శ్రీను ఉద్యోగ ప్రయత్నం పేరుతో భార్యతో సహా విశాఖపట్టణానికి మకాం మార్చాడు. అంత ఇంట్లోనూ ఒంటరి వాడైన సోమినాయుడు మనసు బాగా లేనప్పుడల్లా భార్య గుండం దగ్గరకు పోయి గంటల కొద్దీ గడిపేవాడు. అక్కడున్నంత సేపూ అతనికి సాంత్వన లభించినట్టుంటుందని చాలా సార్లు తనతో చెప్పాడు.

"మామా! ఏటలగ అక్కడే కూకుండి పోనావు? గాలేస్తంది కదా కరంటారిపోద్దట బేగి తినిద్దువుగానీ లెగు ' అంటూ సత్యం నాయుడి కోడలు చింతల్లి చంకలోని బిడ్డకు అన్నం తినిపిస్తూ వచ్చి పిలిచింది.

కోడలి పిలుపుతో ఆలోచనల్లోంచి బయటపడ్డ సత్యంనాయుడు లేచి బడి వరండాలోకి వెళ్లి కూర్చున్నాడు. అక్కడ మిణుకుమిణుకు మంటూన్న బల్బు వెలుతురులో కొందరు భోజనాలు చేస్తుంటే మరో తరగతి భవనంలో దీపం

బుడ్డీ వెలుగులో మరికొందరు తింటున్నారు. అన్నం కలుపుతున్నాడన్నమాటే గానీ సత్యంనాయుడి మనసు మనసులోలేదు. ముద్ద దిగడంలేదు. రోజూ రాత్రి భోజనాలు పూర్తయ్యాక నేస్తంతో తాను ముచ్చటలాడకుండా నిద్ర పోయింది లేదు. సోమినాయుడి పశువుల శాల ముంజూరు దగ్గర వున్న పెద్ద రాయి మీద ఇద్దరూ కూర్చునేవారు. ఇద్దరూ కూర్చున్నారంటే వారి మాటలకు ఇంపూ తెంపూ లేకుండా పోయేది.



"ఏటి మామా! నేస్తమవుపడలేదని మరీ అంత ఇదయిపోతున్నావు. సోమినాయుడు బావు ఏటి సిన్న పిల్లడా?సత్తుగల పేరంటాలు... ఆ ఎల్లమ్మ పిన్ని తెల్లారీసరికి మీ నేస్తాన్ని తీసికొస్తాదిలే" చింతల్లి మామను ప్రేమగా గదమాయించింది.

సత్యంనాయుడు రెండు ముద్దలు తిన్నానిపించి కంచం ముందునుంచి లేచిపోయాడు.

బడికి ఎదురుగా వున్న వంటపాకలో సింహాచలం తన కోసం సిద్ధం చేసి వుంచిన నులక మంచం మీద నడుము వాల్చేడు సత్యంనాయుడు. చుట్టూ చీకటిగా వుంది. వుండుండీ చినుకులు పడుతున్న చప్పుడుతో రేకు పైకప్పు అదురుతోంది సత్యం నాయుడు మనసులాగా.

"అయినా మామా! ఊరు ములిగిపోతుందని తెలిసిన కాణ్ణించి సోమినాయుడు బావు మతి తప్పిన మనిసిలాగా అయిపోతున్నాడు. అందులోనా మనం పెదబావ దెగ్గిటికి బీముడు పట్నం ఎలిపోతున్నామని తెలిసినప్పుడు నుండీ పూర్తిగా మనసొదిలీసినట్టిగైపోతున్నాడు. సోములు బావుకి నువ్వంటే అంత పేణం ..." భుజమ్మీద నిద్రిస్తున్న బాబును సత్యంనాయుడి పక్కనే పడుకోబెడుతూ అంది చింతల్లి.

సత్యంనాయుడు ఏమీ మాట్లాడలేదు. మళ్లీ చింతల్లే మాట్లాడింది "అంతింటిలోనూ సోమినాయుడు బావు ఒక్కడూ ఏల వుండాల? కొడుకు దగ్గిటికి ఎలిపోడం మానీసి. రేప్పొద్దున్న రోగమొస్తే రొష్టొస్తే ఎవులవుతారు? ఆలవుతారు గానీ అయినా నాకేలగానీ... " అంటూ మంచం పక్కనే పాత చాపనొకదానిని పరిచి సింహాచలం కోసం వెతుక్కుంటూ వెళ్ళింది.

చింతల్లి మాటలతో సత్యంనాయుడి ఆలోచనలు గతంలోకి జారుకున్నాయి.

* * *

"ఏటి నేస్తమూ... ఇన్నాళూ పుట్టి పెరిగిన ఊరుతో మన రుణం తీరిపోయినట్టేనా?'' సత్యంనాయుడును బాధగా అడిగాడు సోమినాయుడు.

"అంతే గదా గవరమెంటోడు ఎప్పుడో మనకి పేకేజీలు ఇస్తాడో మానుతాడోగానీ, ఆ కాంటాకిటేర్లు మాత్రం ఆల పని సేసికెలిపోతున్నారు. మనకి వుండడానికి నీడ సూపించకుంటే మన గూడు ముంచీడానికి తయారైపోతున్నారు. డేము సగం దాటి కట్టీసినారు. నీరు అప్పుడే మీ కల్లాల దగ్గిటికొచ్చీసింది. సూస్తన్నావు గావాలా?" సత్యంనాయుడు చుట్ట వెలిగిస్తూ జవాబిచ్చేడు.

"ఊరొదిలి ఎల్లడమంటే ఇంటినీ, ఈదులనీ కాదు.. మీ సెల్లెలినీ ఇక్కడొదిలీసి ఎల్లిపోడమే కదా? మీ సెల్లిలు పోయినా అది తిరిగిన ఇల్లు కదా అని ఇన్నాలూ ఊరొదల్లేక పోనాను. అయినా ఇప్పుడు..." అంటూ అటు పైన మాట్లాడలేక తువ్వాలుతో కళ్లు తుడుచుకున్నాడు సోమినాయుడు.

"ఊరుకో నేస్తం... ఇప్పుడే ఎలిపోతున్నట్టుగా బాదపడిపోతున్నావు. ఏటి సేత్తాం సెప్పు, మనం మనుషులం. ఆ బగమంతుడు ఎలాగ కద నడ్పితే అలాగ నడవలసిందే" అంటూ స్నేహితునికి ధైర్యం చెబుతూ "ఇంతకీ మీ శీనుగాడేటంతన్నాడు?" ప్రశ్నించాడు సత్యం నాయుడు.

"ఆడేటంతాడు... ఆడెప్పుడో వూరు దాటిపోయినాడు. నువ్వొక్కడవూ అక్కడ ఏల వుంటావు? నా దగ్గిటకి వొచ్చీమని అంతాడు." సోమినాయుడు చెప్పాడు.

"మరేటింకన్నూ ఆలోచిస్తన్నావు?" సత్యంనాయుడు ప్రశ్నించాడు.

"నీకు తెలీనిదేటుంది నేస్తం... ఆడిదా ప్రేవేటు ఉజ్జోగం. ఆడి తల మీద సంపాదన ఆడికే సాలడం నేదు. ఇంకా నన్నెల్లి కూకొని తినమంతావా? అయినా నీకు సెప్పకేమీ... బావు రమ్మంతన్నాడని మాటే గానీ కోడలేనాడూ నోరిడిసి రమ్మన లేదు. రేపు మూతి మీద ముద్దెయ్య వలసిందాయి అది గదా! మీ సెల్లిలు కార్యం అయిన కాణ్ణించి కోడలు నోటంట ఆ మాట వస్తాదేటో అని సూసాను. అది పిలిస్తే మాత్రం నానెలిపోతానేటి? ఈ మట్టి మీద పుట్టి పెరిగినోణ్ణి, మీ సెల్లిలు మోజుపడి కట్టించుకున్న ఇల్లు. ఈ ఇల్లొదిలి నానెక్కడికి

## దాగిన గుండెలు



- అడిగోపుల వెంకటరత్నమ్
9848252946

మనుషులు మాట్లాడతారు
జంతువులు శబ్దిస్తాయి
పక్షులు రాగాలు తీస్తాయి
చరాలతోపాటు అచరాలకూ
ప్రాణం వుంది
నీటితల్లి ప్రవాహ గర్భంలో
బిడ్డ ఇసుక పరుగెత్తుతుంది
మైళ్ళకు మైళ్ళు ఉరికిన అలసటతో
మేటవేసి అధిష్ఠించిన ఇసుక
మాయమైన నీటితల్లిని చూపమని
మేఘాల్ని అర్థిస్తుంది
భవన నిర్మాణ నిర్మాతతో చేయికలిపి
సిమెంటుతో జతకట్టి
మేడగా మారి మనిషి నీడౌతుంది
ప్రాణానికి రక్షణౌతుంది
అంతర్మథనంలో నిల్చున్న స్థపతి ముందు
శిల అంతరంగాన్ని విప్పుతుంది
రాధామాధవుల శిల్పమా
శ్రీరాముడు విగ్రహమా
ద్వారాపాలకులా
దిష్టిదంష్ట్రాలా
ఏ రాయి ఆవిష్కరణకో వివరిస్తుంది
మలిచిన రాయి దైవమై
వరాలు ప్రసాదిస్తుంది!
మేల్కొల్పులు పాడిన చెట్టు
కడుపు నింపుకు రమ్మంటూ
పక్షుల్ని దశదిశలకు తరుముతుంది
గాలి కోటా పెంచమని
వాయుదేవుణ్ణి అర్థించి
రకరకాల రాగాలతో జోలపాడుతుంది
గూళ్ళపై మండించే భానుడితో
నీ మంటలు సాగవంటుంది!
తాళపత్రానికి ప్రత్యామ్నాయమై
సమస్త భాషల్ని మోస్తుంది కాగితం
మనిషి మనసు దానిది
మనసు ప్రసవం దానిది
ప్రాచీన సాహిత్యంలో ఛంధస్సై వెలికింది
భావకవిత్వంలో మేఘమై తిరిగింది
అభ్యుదయంలో పిడికిలి బిగించింది
విప్లవంలో అగ్ని రగిల్చింది
కాలచక్రాన్ని క్రమం తప్పకుండా తిప్పే
సూర్యచంద్రుల కాంతిదానిది
శరత్ మేఘవర్ణం దానిది
కాగితం కలానికి సహచరి
చరాచరాలు మాట్లాడుతున్నాయి
లిపి వున్న భాషకు
లిపిలేని మాట ఆలంబన! ❋

---

ఎలిపోగలను?" సోమినాయుడి మాటలు నీరసంగా వినిపించాయి. సత్యం నాయుడు ఇంకేమీ మాట్లాడలేకపోయాడు.

× × ×

ఆలోచనల్లోంచి నిద్రలోకి ఎప్పుడు జారిపోయాడో గానీ బయట గోలగా వుండడంతో మెలకువ వచ్చిన సత్యం నాయుడు చటుక్కున లేచి కూర్చున్నాడు. కోడైతే కూసింది గానీ బయట అంతా చీకటి గానే వుంది దట్టంగా మబ్బులు కమ్ముకుని.

"బావూ సిమాసెలమో! ఏటయ్యిందిరా? ఏటా గోల?" సత్యంనాయుడు మంచం మీద నుంచి లేచి గబాలున బయటకు వస్తూ కేకేశాడు.

సింహాచలం అక్కడ లేకపోవడంతో సత్యం నాయుడుకి తిరిగి జవాబు రాలేదు. జనం పరుగు లాంటి నడకతో ఊరి వైపు కదులుతున్నారు. ఏంజరిగిందో అర్థం కాక ఆతృతతో అతనూ వారిని అనుసరించాడు. ఊరవతల ఉత్తర దిక్కున కళ్ళంలో ఏదో మనిషి ఆకారం నీటిలో కనిపిస్తోందని దార్లో ఎవరో సత్యంనాయుడుతో చెప్పారు. అతని గుండె కలుక్కుమంది. మనసు కీడు శంకించింది. ఒళ్ళంతా నీరసం ఆవహించి చెమటలు పడుతున్నా ఓపికనంతా కూడ దీసుకుని ముందుకు కదులుతున్నాడు. రాత్రి కురిసిన వర్షం ఊరిలోని వీధుల్ని శుభ్రంగా కడిగేసింది. అక్కడక్కడా పైకి రాళ్ళు తేలి కనిపిస్తున్నాయి. మరికొన్ని చోట్ల చిన్న చిన్న గోతులేర్పడి ఆ గోతుల్లో నీరు నిల్చి వుంది.

జనం కళ్ళాన్ని సమీపించారు. కళ్ళం మొత్తం నీటిలో మునిగివుంది. పిల్లలు, ఆడవాళ్ళు దూరంగా ఎత్తైన ప్రదేశంలో నిలబడి చూస్తున్నారు.

నాగావళి ఒడ్డుల్ని ఒరుసుకుంటూ ప్రవహిస్తోంది.

శవం బురదలో కూరుకు పోయి వీపుమాత్రమే కనిపిస్తోంది.

సింహాచలం శవం వైపు అడుగులేసాడు.

నాగావళి కెరటాల హోరు అందరి గుండెల్లో ఎగిసిపడుతున్న సందేహాల్లాగ.

అందర్లోనూ ఒకటే ఆలోచన.

అందరిదీ ఒకటే ఆవేదన.

అందరూ చేస్తున్నది ఒకటే ప్రార్థన...

ఆ శవం సోమినాయుడిది కాకూడదని. ❋

# మరో మహోదయం 'గురజాడ యుగస్వరం'




- రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి
9440222117

*"మహాకవులనూ మహా పురుషులనూ ఆరాధించే వాళ్ళూ అభిమానించేవాళ్ళు వున్నట్టే అభిశంసించేవాళ్ళూ, అపహాస్యం చేసే వాళ్ళూ ఎప్పుడూ వుంటారు. అయితే ఒక రచయితను పొగిడే, తెగిడే వాళ్ళలోనూ రకరకాల వాదనలు, వైరుధ్యాలు గురజాడ విషయంలో వున్నంతగా మరెవరి విషయంలోనూ లేవు. మరి ఈ వైరుధ్యాలు ఆయనలో వున్నాయా? చూసేవాళ్ళలో వున్నాయా? గురజాడ జీవితం సాహిత్య దృక్పథాలు మరోసారి పరిశీలిస్తే తప్ప సమాధానం దొరకని ప్రశ్నలివి. ఈ క్రమంలో ఆయా వాదనల లోతుపాతులు నిగ్గు తేలిస్తే తప్ప అంతుపట్టవు. శతవర్ధంతి అందుకు సరైన సందర్భం"*

ఇదీ గురజాడ నూరవ వర్ధంతి (1915-2015) సందర్భంగా తెలకపల్లి రవి "గురజాడ యుగస్వరం" అనే విమర్శ గ్రంథం రాయడానికి కారణం. గురజాడ సాహిత్యానికెంత చరిత్ర ఉందో, ఆయన సాహిత్యం మీద వచ్చిన విమర్శకూ అంత చరిత్ర ఉంది. ఇటీవల మనసు ఫౌండేషన్ వారి "గురజాడలు" ప్రకారం గురజాడ రచనలన్నీ కలిపి 1450 పుటలవుతాయి. ఆ రచనల మీద ఇప్పటికే కనీసం పదివేల పుటల విమర్శ వచ్చి ఉంటుంది. ఇందులో 1992-2015 మధ్య అంటే కన్యాశుల్కం నాటకం ప్రదర్శింపబడి నూరేళ్ళు, గురజాడ 150వ జయంతి, ఆయన 100వ వర్ధంతి సందర్భాల మధ్య కనీసం అయిదువేల పుటల విమర్శ వచ్చి ఉంటుంది. కాలం నడుస్తున్న కొలదీ గురజాడ సాహిత్యం మీద విమర్శ వట్టిపోకుండా గట్టి పడుతున్నది. ఇందుకు కారణం గురజాడ సాహిత్యం కాలం చెల్లిన సాహిత్యం కాకపోవడమే.

గురజాడ సాహిత్యాధ్యయనంలో తెలకపల్లి రవి గ్రంథం ఈ దృష్టితో వచ్చిందే. గురజాడ జీవిత సాహిత్యాల మీద కె.వి. రమణారెడ్డి 'మహోదయం' మొదటి 'మహత్తర' గ్రంథమైతే, 'గురజాడ యుగస్వరం' రెండవ మహత్తర గ్రంథం. భాషా పరమైన సౌలభ్యం ఉండడం రవిగారి గ్రంథ విశిష్టత.

రాచరిక భూస్వామ్య వర్ణ పురుషాధిపత్య అసమ సామాజిక వ్యవస్థను ప్రతిబింబించే వందల ఏళ్ళ నాటి పురాణ వాఙ్మయాన్ని నేటికీ తిరుగులేనిదిగా తరుగులేనిదిగా మరువరానిదిగా ప్రభుత్వ ప్రైవేటు మాధ్యమాలలో గుంపు గట్టుకుని ప్రచారం చేస్తున్నారు సంప్రదాయ విద్వాంసులు. ఈ నేపథ్యంలో ఆధునికత అంటే ఏమిటో రుచి చూపించిన, లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థను కోరుకునే గురుజాడ సాహిత్యం ఇంతకు ముందటి కన్నా లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. ఈ అవసరాన్ని తీరుస్తూ రవిగారి గ్రంథం వచ్చింది.

గురజాడ సాహిత్య విమర్శకులంతా ఒకే రకమైన వారు

కాదు. వాళ్ళను సంప్రదాయ వాదులు, ఆధునికులు అని విభజించవచ్చు. సంప్రదాయవాదులలో కూడా గురజాడను తిరస్కరించే వాళ్ళూ, సమర్థించే వాళ్ళూ ఉన్నారు. సమర్థించే సంప్రదాయవాదులు గురజాడ సృజనాత్మకతను మాత్రమే మెచ్చుకుంటారు. గురజాడను అభావం చెయ్యడానికి 1955 నుండి జరుగుతున్న ప్రయత్నాలన్నీ ఎప్పటి కప్పుడు విఫలమౌతూనే ఉన్నాయి.

***1892 నుండి 2015 దాకా గురజాడ సాహిత్యం మీద వచ్చిన వైవిధ్య భరితమైన విమర్శను సమీక్షించి చివరికి "గురజాడ భావాలకూ, సంస్కరణలకూ ఇప్పుడు గతం కన్నా ప్రాధాన్యత పెరిగింది. అందుకు దేశంలో వచ్చిన రాజకీయ, సామాజిక దుష్పరిణామాలు కూడా ఒక కారణం" అని నిర్ణయించారు.***

ఆధునికులలో కూడా గురజాడను సమర్థించే వాళ్ళు, తిరస్కరించే వాళ్ళూ ఉన్నారు. గురజాడ కులం, ఆయన ప్రాంతం, ఆయన సాహిత్యంలో కనిపించే జీవితం వంటి వాటిని పెట్టుకొని ఆయనకు మాకు సంబంధం లేదనే ఆధునికులున్నారు. ఆయన పరిమితులను గుర్తిస్తూనే గౌరవించే ఆధునికులూ ఉన్నారు. దశాబ్దాలుగా సామాజిక సందర్భం మారినా గురజాడ సాహిత్యం ప్రాసంగికత రూజువౌతూ వస్తున్నది. ఈ వాస్తవాన్ని గుర్తించి గురజాడను ప్రజల దగ్గరికి తీసుకు వెళ్ళుతున్నది మార్క్సిస్టు విమర్శకులే. రవి ఈ చైతన్యంలో ముందుంటున్నారు.

సాహితీ సామాజిక రంగాలలో నిరంతరం కృషి చేస్తున్న సవ్యసాచి రవి. సాహిత్య చర్చలలో సామాజికాంశాలను, సామాజిక చర్చలలో సాహిత్యాంశాలను పుంఖానుపుంఖంగా ఉదహరిస్తూ సమన్వయం చేసుకుంటూ చర్చకు రక్తమాంసాలు కల్పించే ఆధునికులు రవి. గురజాడ నూరవ వర్ధంతి సందర్భంగా ఈ గ్రంథం రచించారు.

జి.వి. కృష్ణారావు కళా పూర్ణోదయం మీద విమర్శ రాస్తూ, తనకన్నా ముందు ఆ కావ్యం మీద వచ్చిన విమర్శలనన్నిటినీ సమీక్షించారు. పరిశోధనలో, విమర్శ గ్రంథ రచనలో ఇది శాస్త్రీయ పద్ధతి. రవి "గురజాడ యుగస్వరం" లో ఈ పనే చేశారు. 1892 నుండి 2015 దాకా గురజాడ సాహిత్యం మీద వచ్చిన వైవిధ్య భరితమైన విమర్శను సమీక్షించి చివరికి "గురజాడ భావాలకూ, సంస్కరణలకూ ఇప్పుడు గతం కన్నా ప్రాధాన్యత పెరిగింది. అందుకు దేశంలో వచ్చిన రాజకీయ, సామాజిక దుష్పరిణామాలు కూడా ఒక కారణం" అని నిర్ణయించారు.

'గురజాడ యుగస్వరం' పుస్తకంలో గురజాడ జీవితాన్ని ఆయన రచనలను ప్రక్రియల వారీగా పరిచయం చేయడం ఒక పార్శ్వం ఇతరుల విమర్శలను ప్రస్తావిస్తూ, వాటిలోని బాగోగులను చర్చిస్తూ, తన తీర్పు నివ్వడం మరో పార్శ్వం. ఇందులో మనకు మూడు పార్శ్వాలు కనిపిస్తాయి. 1. గురజాడ వ్యతిరేకులను పూర్వ పక్షం చేయడం 2. గురజాడ అనుకూలుర అభిప్రాయాలను సవరించడం 3. గురజాడపైన తనవైన అభిప్రాయాలు చెప్పడం. ఇది మార్క్సిస్టు విమర్శ విధానం. నాలుగో అంశాన్ని కూడా ఈ గ్రంథంలో మనం గుర్తించవచ్చు. పూర్వ పరిశోధకులకన్నా, విమర్శకులకన్నా, గురజాడకు సంబంధించిన అదనపు సమాచారాన్నివ్వడం.

'సారంగధర' కథ పౌరాణికం. రసాభాస కథ. గురజాడ 1883లో యువ కవిగా ఈ కథను ఆంగ్ల కావ్యంగా రాశారు. గురజాడ విమర్శకులలో ఎక్కువ మంది ఈ కావ్యాన్ని పెద్దగా పట్టించుకోలేదు. రవిగారు ఈ కథను అసమ వివాహ దుష్ఫలితాలను చూపించడానికి గురజాడ రాశారని పేర్కొన్నారు. విషాద సారంగధర (ధర్మవరం), పారిజాతా పహరణం (పానుగంటి) వంటి రచనలలో కూడా ఈ ధోరణి కనిపిస్తుంది. ఈ సందర్భంలో గురజాడకు జాతీయ స్థాయిలో రావలసిన గుర్తింపు రాలేదని శ్రీశ్రీ బాధపడడం అనవసరమని, గురజాడకు ఠాగూర్‌తో పరిచయం గలగడం, శంభు చంద్రముఖర్జీ గురజాడను అభిమానించడమే ఆయనకు వచ్చిన పెద్ద గుర్తింపు అని పేర్కొన్నారు రవిగారు.

గురజాడ అప్పారావు రచయితగా ఎదిగే నాటికి భారత దేశంలో నెలకొన్న చారిత్రక నేపథ్యాన్ని రవి వివరంగా చెప్పి, అప్పుడు మన దేశం ఎలా ఉందంటే పునర్వికాస పునరుద్ధరణ వాదాల హోరాహోరీగా ఉన్నదని నిర్ధారించారు. ఒక కొత్త రకం రచయిత ఆకాశంలోంచి ఊడిపడడు. సామాజిక పరిస్థితులే రచయితల్ని సృష్టిస్తాయి అనే మార్క్సు సిద్ధాంతాన్ని గురజాడకు అన్వయించారు రవి. భారతదేశంలో ప్రాచీన కాలంలోనే నాటక ప్రక్రియ అత్యున్నతదశకు చేరుకొంది కాని మధ్య యుగాలలో ప్రాంతీయ భాషా సాహిత్యాలలో నాటకాలు రాలేదు. నాటకాలు శ్రవ్య కావ్యాలు గానే అనువాద మయ్యాయి. వలస పాలనలోనే తిరిగి భారతీయ నాటకం మొదలయ్యింది. అయితే ఆధునిక భారతీయ నాటకం ప్రాచీన భారతీయ నాటకానికి కొనసాగింపు కాదని, అది పాశ్చాత్య సాహిత్య ప్రభావమని రవి స్పష్టం చేశారు. 'కన్యాశుల్కం' నాటక కాలం నాటి నాటక పరిస్థితి మీద కొత్త ఆలోచనలు చేశారు. ప్రాచీన తెలుగు సాహిత్యం మొదలయ్యే నాటికి, సంస్కృత సాహిత్యం

క్షీణ దశలో ఉంటూ తెలుగుమీద ప్రభావం చూపినట్లే, భారతీయ నాటక కర్తలు ఆంగ్ల నాటికల వైపు మళ్ళే సమయానికి ఆ నాటకం తిరోగమనంలో ఉంది అనడం కొత్త చూపు. మొదటి సంపూర్ణ వచన నాటకం రాసినది గురజాడేనని, ఇబ్సన్ ప్రభావానికి గురైన మొదటి భారతీయ నాటక రచయిత కూడా ఆయనేనని పేర్కొన్నారు. గురజాడ తన కాలం కన్నా వెనుకబడలేదు అంటూనే కన్యాశుల్కం నాటకంతో కాలాన్ని మించి పోయారనే ఆవేశాన్ని రవి తిరస్కరించారు. గురజాడ ఇతర నాటక రచయితల కన్నా ఆధునికుడు, సాహసి అంటూనే, అలాంటి ఆయనకు కూడా పరిమితులున్నాయని గుర్తించడం మార్క్సిజం నేర్పిన వాస్తవిక పద్ధతి. గురజాడ శిష్ట సమాజాన్ని విశ్లేషించినంతగా, ఇతర తరగతులను చిత్రించలేదు అని రవి చేసిన నిర్ధారణ సరైనదే. గిరిజన సమాజం తన చుట్టూ ఆవరించి ఉన్నా గురజాడ ప్రధాన స్రవంతి జీవిత చిత్రణకే ఎందుకు పరిమితమయ్యారన్నది ఆలోచించ వలసిందే. మాట్లాడడానికి, చదువుకోడానికి, రాయడానికీ ఒకే భాష చాలని గుర్తించినట్లే, గురజాడ కవిత్వానికీ, కథలకు, నాటకానికి ఒకే భాష ఉపయోగపడుతుందని గుర్తించారన్నారు. రాజకీయాల్లో లాగే భాషా సాహిత్యాల్లో కూడా ప్రజాస్వామ్యం రావాలని గురజాడ కోరుకున్నారన్నారు. రెండు కన్యాశుల్కం నాటకాలు ఎవరెవరని ఎలా కదిలించాయో రవి సరికొత్త సమాచారంతో వివరించారు. "నడుస్తున్న చరిత్రను కన్యాశుల్కం" అక్షర అద్ధం చేసింది" అన్నది సరైన అభిప్రాయం.

**ఇటీవల అనేకమంది గురజాడకు పూర్వం రాసిన కథలు వెలుగులోకి వచ్చాయి. అయినా కొందరు గురజాడ అభిమానులు శిల్ప పరిణతిని పాయింటుగా చూపి గురజాడనే సమర్థిస్తున్నారు. కాని రవిగారు హూందాగా "ఏవో వాదనలతో గురజాడనే ప్రథముడుగా ప్రతిష్టంచవలసిన పనిలేదు" అన్నారు. చరిత్రను గౌరవించే మార్క్సిస్టు విధానమిది.**

రచయితకు శాశ్వతకీర్తినీ, పాఠక ప్రేక్షకులకు అపూర్వానుభూతిని ఇచ్చిన పాత్రలు మధురవాణి, గిరీశం అంటూ రవి చేసిన చర్చ ఇతర విమర్శకులకు భిన్నంగా ఉంది. అయితే కన్యాశుల్కం నాటకాన్ని దళిత బహుజన వాదులలో ఒకరిద్దరు గురజాడ కులం, ప్రాంతం, ఆ నాటకంలో చిత్రింపబడిన జీవితం ఆధారంగా తిరస్కరించే ప్రయ్నతం చేయడాన్ని ఆహ్వానిస్తూనే, వాళ్ళలోని లోపాన్ని కూడా ఎత్తి చూపారు రవిగారు. ఇలాంటి చోట్ల రవి వాస్తవిక దృష్టి వ్యక్తమౌతుంది. దళిత బహుజన వాదులు ఏ వ్యవస్థ మీద పోరాటం చేయాలనుకుంటున్నారో, దానికి ఆ నాటకం ఉపయోగ పడుతుందన్నారు.

గిరీశం మీద వచ్చిన అనేక రకాల విమర్శలను సమీక్షించిన రవి ఆ పాత్ర మీద తనవైన కొన్ని అభిప్రాయాలు చెప్పారు. మార్పు ఒకవైపు ఆ పేరుతో మాయ చేయడం మరోవైపు – దానికి ప్రతీక గిరీశం అన్నారు. గిరీశం గురజాడకు ప్రతినిధి పాత్ర అనే అభిప్రాయాన్ని తిరస్కరించడానికి, రవిగారు, కొకును కూడా తిరస్కరించడానికి వెనుకాడలేదు. రవి దృష్టిలో గిరీశం ఒక దగుల్బాజి.

గురజాడ ముందు నాటకాలు, తర్వాత కవితలు రాశారు. అందువల్ల నాటకాలలో కన్నా కవితలలో పురోగామి భావాలుండడం సహజం. ఈ తేడాను రవి గుర్తించారు. కన్యాశుల్కం నాటకంలో సందర్భాలకు సరిపోయే సంభాషణలుండటం వాస్తవమేనంటూ, సామాజిక సాహిత్యాంశాలకు, మానవ సంబంధాలకూ అవగాహన నిచ్చినవి మాత్రం గురజాడ కవితలేనని రవి అభిప్రాయ పడ్డారు. కర్తవ్య బోధ చేసింది గురజాడ కవితలేనన్నారు. ఇది కొత్త పరిశీలన, 'కాసులు' కవితతో గురజాడ పురాణ ప్రబంధ భావ కవితలు స్త్రీలకిచ్చిన స్థానాన్ని తలక్రిందులు చేశాయన్నారు. 'లవణరాజుకల' కవిత ఇప్పటికీ నిత్య నూతన మన్నారు. ఈ కవితను అవగాహన చేసుకోవడంలో తడబడ్డ వాళ్ళను రవి సవరించారు. 'దేశభక్తి' కన్నా ముందు వచ్చిన దేశభక్తి కవితల కన్నా గురజాడ కవిత ఎలా ఉన్నతమైందో రుజువు చేశారు.

మొన్నటిదాకా గురజాడే తొలి తెలుగు కథకుడు అని అనుకుంటూ ఉండేవాళ్ళం. ఇటీవల అనేకమంది గురజాడకు పూర్వం రాసిన కథలు వెలుగులోకి వచ్చాయి. అయినా కొందరు గురజాడ అభిమానులు శిల్ప పరిణతిని పాయింటుగా చూపి గురజాడనే సమర్థిస్తున్నారు. కాని రవి హూందాగా "ఏవో వాదనలతో గురజాడనే ప్రథముడుగా ప్రతిష్టంచవలసిన పనిలేదు" అన్నారు. చరిత్రను గౌరవించే మార్క్సిస్టు విధానమిది. కథల మీద చర్చ బాగా జరిగిపోయిందనుకున్నారేమో, టూకీగా చెప్పి వదిలేశారు.

ఆధునికతకు ఆద్యుడుగా గురజాడను హేతుబద్ధంగా ప్రతిపాదించారు రవి. గురజాడను ఎంతో గౌరవించే రారా, కె.వి.ఆర్. లాంటి వాళ్ళు కూడా ఆయనలోని ఆధునికతను పూర్తిగా గుర్తించలేక పోయారని రవి అభిప్రాయపడ్డారు.

# విధ్వంసక దృశ్యం...

- నీలం వెంకటేశ్వర్లు
9502411149



రైతుకు భూమంటే ప్రేమ
రైతుకు పంటంటే ప్రేమ
రైతుకు అన్నం పెట్టటమంటే ప్రేమ
కాని చావుకు రైతంటే ప్రేమ
ఆత్మహత్యలు చూస్తున్న పాలకులకు
రైతుల చావంటే ప్రేమ..!?

మట్టితో మమేకమై
ఆ మట్టిలో విత్తిన విత్తనం
రైతు గుండెలో
కోటి ఆశలుగా మొలకెత్తితే
సీమపై సీతకన్ను వేసిన వానదేవుడు
రాళ్ళమాటున మొహం చాటేసి
సరాసరి రైతు కళ్ళల్లో పడ్డాడు
అయినా... ఆశ వదలని విక్రమార్కుడు
నరాలన్నీ మైపులుగా కూర్చి
రక్తాన్నంతా డీజిల్ గా పోసి

నీరుకట్టి పంట పండిస్తే
మార్కెట్ శక్తుల మాయజాలంతో
సర్వసంపదల సృష్టికర్తకు
అప్పులే దిగుబడులయ్యాయి
అప్పులిచ్చినోళ్ళు
నక్షత్రకులై వెంటాడుతుంటే
రైతుల బతుకులు
పొలంలోనే పొద్దుగూకుతున్నాయి
ఈనాడు... సీమ ప్రాజెక్టులు
మాటల మాంత్రికుల
నీటి మూటలతో నిండిపోయి
రాళ్ళుగా ప్రవహిస్తుంటే
దిగులుపడిన రైతుకేదీ దన్ను?

సీమరైతుల దీనవదనాలు
ఛిద్రమైనబతుకులు కన్నీటినయనాలు
పాలకులకు పట్టవా?
ప్రకృతి వైపరీత్యాలు కరువులు
కల్తీమందులు కల్తీవిత్తనాలు
బోరుబావులు విద్యుత్ ఘాతాలు
ఇలా ఎన్నాళ్ళు... ఇంకెన్నేళ్ళు
రాయలసీమ రైతు ఇంట చావుడప్పులు

పాలకులు పన్నిన వలలో చిక్కిన రైతన్న
జాగ్రత్త!
ఇప్పుడు
రైతంటే ప్రాణాలు తీసుకునే పిరికివాడు కాక
పోరాడే వీరుడు కావాలి! ❋

---

కందుకూరి, రాయప్రోలు, కృష్ణశాస్త్రి వంటి వాళ్ళ కన్నా గురజాడ ఎలా ఆధునికుడో శాస్త్రీయంగా రుజువు చేశారు. "గురజాడ సాహిత్యాన్ని విమర్శించే వాళ్ళకు కూడా ఆయనకున్నట్లే పరమ ఆధునికమైన దృష్టి వుంటే తప్ప ఆయన సాహిత్యం గానీ, ఆయన వ్యక్తిత్వం గానీ సరిగా అర్థంగావు" అన్నది నూటికి నూరుపాళ్ళు నిజం.

గురజాడ మార్గం శ్రీశ్రీలో చూడమని రవి చేసిన పరిశీలన కూడా ఆయన సొంతమే. ఈ విషయంలో ఆయన వెల్చేరును సవరించారు. శ్రీశ్రీలోని గురజాడ వారసత్వం చెప్పి, గురజాడ కన్నా శ్రీశ్రీ కొన్ని అంశాలలో వెనకబడటం కూడా ఎత్తి చూపించారు రవి. ఇద్దరు అభిమాన కవుల మీద ఇంత నిష్పాక్షికంగా విమర్శ రాయడం మార్క్సిజం నేర్పిన నిజాయితీ. గురజాడ రాసిన 'దేశభక్తి' కవిత గురజాడ రాయలేదని, కమ్యూనిస్టులే రాసి గురజాడ రాసినట్లు ప్రచారం చేయడం తెలుగు వాళ్ళకే చెల్లిన వితండ వాదమేమో!

గురజాడ "నాది ప్రజల ఉద్యమం. ఎవరిని సంతోష పెట్టడానికి దాన్ని వదులుకోలేను" అని చెప్పిన వాక్యాల నేపథ్యం రవి వివరంగా పేర్కొన్నారు. సామినేని చెప్పిన భాషా సూత్రాలను మొదట అమలు చేసింది గురజాడేననడం మౌలిక పరిశోధన. గ్రాంధిక వ్యావహారిక భాషా యుద్ధంలో గురజాడ పాత్రను రవి వివరించారు. ఇది చదివితే ఇవాళ మనం ఎంతో ఆధునికంగా ఉండడానికి గురజాడ వంటి వారు చేసిన శ్రమ అర్థమౌతుంది. గిడుగు, గురజాడల నాటి భాషా ఉద్యమాన్ని ఇటీవల రాష్ట్ర వివాదాల నేపథ్యంలో చూడరాదన్న రవి అభిప్రాయం కూడా గుర్తించదగినదే. విద్యారంగంలో గురజాడ దృష్టిని రవి వివరించడం కొత్తగా ఉంది. అలాగే నైతికవిలువల పట్ల గురజాడ దృష్టిని పరిశీలించడం కూడా కొత్తదే. గురజాడపైన రవి గ్రంథమంతా చదివిన తర్వాత గురజాడ కాలం చెల్లిన రచయిత కాదని స్పష్టమౌతుంది. ఆయన భావజాలం, ఆయన కులం, ఆయన ప్రాంతం నచ్చక చేసే విమర్శలు నిలవవని కూడా అర్థమౌతుంది.

'గురజాడ యుగస్వరం' భాషా సౌలభ్యంతో కూడిన 21వ శతాబ్దపు 'మహోదయం'. మరో 'మహోదయం' ❋

# మెరవణి కథల సంపుటి - వర్ణనలు * ప్రతీకలు




- లక్కినేని రాజీవ్‌బాబు,
8142111772

*'మెరవణి' కథా సంపుటిలోని ప్రతీ కథలో పల్లె వాతావరణం తెలిసిన ప్రతి ఒక్కరి జీవితంలో తారసపడిన అంశాలే. రాసాని కథలను చదువుతున్నంత సేపు అనుభవాలను నెమరువేసుకున్నట్లు ఉంటుంది. పాఠకుడు పాత్ర ధారియై భావోద్వేగాలను అనుభవించే రచనా విధానం 'రాసాని' సొంతం. ఇందుకు కథలన్నీ విషాదాంతాలే అయినప్పటికీ వాస్తవికతకు అత్యంత సమీపంగా ఉండడం వల్ల సాహిత్య పిపాసకులను మెప్పిస్తాయి.*

బడుగు బ్రతుకులను బంధువుగా దర్శించి, కథా కన్నుల నుండి అక్షరాశ్రువులను రాల్చిన కథాశిల్పి 'రాసాని'. నిరుపేద బ్రతుకులే రాసాని కథలకు ముడిసరుకు. సాహిత్యం సామాన్యుని జీవితానికి అద్దం పట్టాలనే భావన ఈ కథల్లో ప్రస్ఫుటంగా కన్పించే అంశం. పల్లె జీవితంలోని ప్రతీ అంశాన్నీ సునిశితంగా పరిశీలించి, స్థానీయత మీద పట్టును సాధించిన భాధ్యతాయుత రచనా విధానం రాసాని కథల్లో కన్పిస్తుంది. పదేండ్ల ప్రాయపు బాలుడి దగ్గర నుండి జీవిత పరమార్థం తెలుసుకున్న బైరాగి వరకు అందరి మనస్తత్వాలను, బాధలను, బాధ్యతలను, ఆవేశాలను, ఆవేదనలను కథలుగా మలచారు రాసాని.

'మెరవణి' కథా సంపుటిలోని ప్రతీ కథలో పల్లె వాతావరణం తెలిసిన ప్రతి ఒక్కరి జీవితంలో తారసపడిన అంశాలే. రాసాని కథలను చదువుతున్నంత సేపు అనుభవాలను నెమరువేసుకున్నట్లు ఉంటుంది. పాఠకుడు పాత్ర ధారియై భావోద్వేగాలను అనుభవించే రచనా విధానం 'రాసాని' సొంతం. ఇందుకు కథలన్నీ విషాదాంతాలే అయినప్పటికీ వాస్తవికతకు అత్యంత సమీపంగా ఉండడం వల్ల సాహిత్య పిపాసకులను మెప్పిస్తాయి. ఉత్తమ పురుషలో సాగిన కథలలోను, పాత్రలు మాట్లాడిన సందర్భంలోనూ, చిత్తూరు జిల్లా మాండలికాన్ని ఉపయోగించడం వల్ల సన్నివేశాలను, సంఘటనలను అతి దగ్గరగా చూసిన భావన కలుగుతుంది. 'రాసాని' కథలను చదవబోవడమంటే సామాన్యుని జీవితాన్ని అనుభవించడమే.

రాసాని కథల్లో ప్రతీకాత్మకంగా ఉండే వర్ణనలు కనిపిస్తున్నాయి. కథ ఎత్తుగడలోనో, కథా గమనంలోనో, ముగింపులోనో ఈ వర్ణనలు కనిపిస్తున్నాయి. నిశితంగా పరిశీలిస్తే కథ యొక్క ఉద్దేశ్యం, సారాంశం దాదాపుగా ఈ వర్ణనల వల్ల తెలుస్తోంది.

ప్రకృతినో, పరిస్థితినో వర్ణించడం ద్వారా జరగబోయే విషయాలను సూచనాప్రాయంగా పాఠకుడికి తెలియచేసే ప్రతీకాత్మకధోరణి ఈయన కథల్లో కన్పిస్తుంది. 'మెరవణి' కథా సంపుటిలోని చాలా కథల్లో సూర్యుడిని ప్రతీకాత్మకంగా వర్ణించారు. సామాన్యుని జీవితంలో, పరిస్థితులను ఎదుర్కొని, నిలదొక్కుకొని జీవించడం, కష్టాలను భరించలేక తనువు చాలించడం అనేవి రెండు ముఖ్య ఘట్టాలు, ఇటువంటి జీవితాల్ని ఆధారంగా చేసుకుని రాసిన కథలు కనుక సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు ప్రతీకాత్మకంగా కన్పిస్తాయి.

'హోమం' కథలో చేసిన సూర్యోదయ వర్ణన కుల

నిర్మూలనను కోరుకునే రచయితని గుర్తు చేస్తుంది. సమసమాజ నిర్మాణం కోసం తనవంతు కృషి చేయాలనే ఉద్దేశ్యం ప్రస్ఫుటమౌతుంది. అగ్రకులాల చేతిలో అణగదొక్కబడుతున్న నిమ్న కులాల వారిలో చైతన్యం కలిగించే కథ ఇది. అందువల్లనే ఈ కథ ప్రారంభంలో "చీకటి తెరల్ని చీల్చుకొని, తూర్పు కొండల్ని ఎర్రబరుస్తూ, చిదిమిన టమోటా పండులా ఆకాశంలోకి ఎగబ్రాకుతూ ఎర్రగా పుట్టుకొస్తున్నాడు సూర్యుడు" అని వర్ణించారు.

*చీకటి తెరల్ని చీల్చడం, తూర్పు కొండలను ఎర్రబర్చడం అనే మాటలు అనాదిగా అగ్రకులాల చేతిలో అణగద్రొక్కబడిన నిమ్న కులాల వారి చైతన్యానికి ప్రతీకలు. వారిలో వచ్చిన కుల నిర్మూలన పోరాటానికి గుర్తులు.*

చీకటి తెరల్ని చీల్చడం, తూర్పు కొండలను ఎర్రబర్చడం అనే మాటలు అనాదిగా అగ్రకులాల చేతిలో అణగద్రొక్కబడిన నిమ్న కులాల వారి చైతన్యానికి ప్రతీకలు. వారిలో వచ్చిన కుల నిర్మూలన పోరాటానికి గుర్తులు. చిదిమిన టమోటా పండులా ఆకాశంలోకి ఎర్రగా ఎగబ్రాకుతున్న సూర్యుడు అని అనడం 'సిన్రాయుడు' పాత్ర నాయకత్వంలో చైతన్య వంతులుగా మారిన ఆ ఊరి బడుగు జీవలకు ప్రతీక. ఈ కథలో ఈ ప్రతీకాత్మక వర్ణన ద్వారా ఎత్తుగడలోనే తరువాతి కథలో జరగబోయే సారాంశాన్నంతా తెలిపాడు కథకుడు. అంటరానితనాన్ని నిర్మూలించాలని రచయితగా తనవంతు బాధ్యతను నిర్వర్తించారు రాసాని.

"అప్పటికే సూర్యుడు పడమటి కొండల్లో అంతర్థానమయ్యాడు. ఎన్నటికీ అంతుపట్టని పెనమాయలా చీకటి క్రమంగా లోకాన్నీ ఆక్రమించుకోసాగింది." ఈ వర్ణన 'మిన్నేరు' కథలోనిది. మనిషి పుట్టుక, మరణం ఈ రెండింటి మధ్యన ఉన్న బంధాలు, మానవుడు అనుభవించే బాధలు, సంతోషాలు, వీటి మర్మాన్ని తెలుసుకోవడానికి ఒక సామాన్య వ్యక్తి (మొండోడి పాత్ర) చేసే మానసిక పోరాటాన్ని తెలియచేసిన కథ ఇది. జీవిత పరమార్థాన్ని తెలుసుకున్న పాత్రగా 'బైరాగి', ఈ జీవిత రహస్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించే పాత్రగా 'మొండోడు' కనిపిస్తారు. వీరిద్దరి పరిచయం, వీరి మధ్య జరిగే సంవాదం, వివిధ సన్నివేశాల చిత్రణ ద్వారా మానవజన్మ పరమార్థాన్ని విపులంగా తెలియచేసినప్పటికీ, సూర్యాస్తమయ వర్ణన ద్వారా మానవుని పుట్టుక, మరణాలకు సంబంధించిన పరమార్థం తెలుసుకోవడం సాధ్యం కాదు అనే విషయాన్ని ప్రతీకాత్మకంగా చెప్పారు కథకులు. అందుకే '....ఎన్నటికీ అంతుపట్టని పెనుమాయలా చీకటి క్రమంగా లోకాన్ని ఆక్రమించుకోసాగింది' అని వర్ణించారు.

ప్రకృతి పోరాడి ఓడిపోయి, నిరుత్సాహం, నిస్తేజంతో కరుకు మనిషిగా మారిన సామాన్య రైతు వ్యథ 'అన్నేకారి జల'. నీటి కోసం పోరాటం చేసి, ఈ పోరాటంలో భాగంగా సర్వం కోల్పోయి, చివరికి ఆత్మహత్యా ప్రయత్నానికి పాల్పడి, అందులోనూ ఓడిపోయిన రాయలసీమ సామాన్య రైతుగుండె కోతకు అద్దం పడుతుంది కథ. ఈ సారాంశాన్నంతా సూచించే విధంగా 'ఆకాశం పటమెగిరి తూర్పున తెల్లంగ త్యాన్ రేగ్. కొండల్ని చీల్చుకుంటూ ఎర్రంగా మండే కొలిం మాదిర్తో పుట్టుకొచ్చె సూరీడు' అనే ప్రతీకాత్మక వర్ణన చేశారు రాసాని. కష్టాలకు ఎదురొడ్డి పోరాడి గెలుస్తూ, ఓడిపోతూ జీవనం సాగించి, చివరికి కరుకు మనిషిగా మారి, కష్టాలకు, అవమానాలకు, బాధలకు, బాధ్యతలకు వ్యతిరేక సమాధానాలిచ్చుకుంటూ జీవనం సాగించిన రైతుపాత్ర 'మునెప్ప'కు ప్రతీక ఈ సూర్య వర్ణన. ఎర్రగా మండే కొలిమితో పోలుస్తూ, సూర్యున్ని వర్ణించడం పరిస్థితుల ప్రభావం వల్ల కరుకుగా, మొండిగా మారిన మునెప్పను సూచించడానికే.

అసాంఘిక కార్యకలాపాల గురించి, వీటి వెనుకవున్న పరిస్థితుల గురించి, అంతరించిపోతున్న మానవ విలువల గురించి, ఆవేదనతో రాసిన కథ 'చీకటి' మాయదారి ముసుగు వెనుక సాగే చీకటి కార్యకలాపాలను కళ్ళకు కట్టినట్టుగా రాశారు రాసాని. బాడాబాబుల అండదండలతో తమ స్వార్థం కోసం చీకటి వ్యాపారాలు చేసే వ్యక్తుల గురించి 'సుబ్బారాయుడు' పాత్ర ద్వారా తెలిపారు. గంజాయి వ్యాపారం, డ్రగ్స్ వ్యాపారం, వ్యభిచారం మొదలగు సభ్య సమాజ వ్యతిరేక పనుల ద్వారా నాశనమౌతున్న మనిషి జీవితాన్ని తెలిపే కథ ఇది. ఇటువంటి పరిస్థితులను సూచించే విధంగా ఈ కథ ఎత్తుగడలో సూర్యాస్తమయం గురించి చేసిన వర్ణన ప్రతీకాత్మకతకు ఉదాహరణ.

"ఏడు గుర్రాల రేడు వేట చాలించి చాలా సేపయింది. మసక చీకట్లు కమ్ముకొస్తున్నాయి. మేలి ముసుగు కప్పుకొని చీకట్లో నిలబడిన రాచ కన్యలా వుంది నగరం" అనే ఈ వర్ణన ద్వారా రాజు రక్షణ కోల్పోయిన రాచకన్య పరిస్థితి ఎలా

ఉంటుందో, చీకటి అలుముకున్న నగరం పరిస్థితి అలా ఉంటుందని వర్ణించారు. మనిషి మనస్తత్వం తప్పుదోవ పట్టినప్పుడు ఎలాంటి అనర్థాలు జరుగుతాయో సూచించిన ఈ కథలోని పై వర్ణన కథా సారాంశాన్నంతా సూచిస్తుంది. వెలుగు అనేది ఒక మంచి ప్రతీక. కాబట్టి ఆ వెలుగును ప్రసరింపచేసే సూర్యున్ని వేటచాలించిన ఏడుగుర్రాల రేడుగా వర్ణించడం అంతరించిపోతున్న సామాజిక విలువలు, మనిషి కోల్పోతున్న మానవత్వపు విలువలను సూచించడమే.

*మితిమీరిన తన్మయత్వం కూడా ఒక్కొక్కసారి మనిషి ప్రాణాలు తీస్తుంది అనడానికి నిలువెత్తు ఉదాహరణ ఈ కథ. వసంత కాలాన్ని, ఈ కాలంలో కోకిల గానాన్ని తనువు మరచి ఆస్వాదించే ఒక వ్యక్తి అదే కోకిల గానానికి బలికావడమనే విచిత్రమైన సమస్యను కథగా మలచారు రాసాని.*

మితిమీరిన తన్మయత్వం కూడా ఒక్కొక్కసారి మనిషి ప్రాణాలు తీస్తుంది అనడానికి నిలువెత్తు ఉదాహరణ ఈ కథ. వసంత కాలాన్ని, ఈ కాలంలో కోకిల గానాన్ని తనువు మరచి ఆస్వాదించే ఒక వ్యక్తి అదే కోకిల గానానికి బలికావడమనే విచిత్రమైన సమస్యను కథగా మలచారు రాసాని. ఆ కథ పేరే నేలరాలిన వసంతం.

కోకిల గానమంటే తనను తాను మరచిపోయి ఆనందపడే విచిత్ర మనస్తత్వం కలిగిన పాత్ర 'కోకిలన్న'. ఇతని అసలు పేరు 'తిమ్మగాడు' అయినప్పటికీ కోకిల గానమంటే చెవికోసుకునే మనస్తత్వం కావడంతో ఇతన్ని కోకిలన్న అని పిలిచేవారు. మేకలు, గొర్రెలు కాసుకునే కోకిలన్న కోకిల ద్వారా ఎన్నో సమస్యల్ని ఎదుర్కొని, కళ్ళు కూడా కోల్పోయి, చివరికి అదే కోకిలపై పగను పెంచుకుంటాడు. ఇలా కోకిలపై పగతీర్చుకునే క్రమంలో చివరికి ప్రాణాలే కోల్పోతాడు. ఈ కథనంతటిని సూచించే విధంగా, పగతో రగులుతూ ప్రాణాలు కోల్పోయిన కోకిలన్న స్థితిని సూచించే విధంగా సూర్యాస్తమయ వర్ణనను ప్రతీకాత్మకంగా వర్ణించారు.

'భగభగ మండే అగ్ని బాణంలా పడమటి కొండల్లోకి దూసుకుపోతున్నాడు సూర్యుడు'. ఒకప్పుడు కోకిల గానంపై అమితమైన ఇష్టమున్న వ్యక్తి అదే కోకిలపై పగను పెంచుకుని ప్రాణాలు కోల్పోవడమనే సూచన ఈ వర్ణన ద్వారా ప్రతీకాత్మకంగా తెలియచేశారు రచయిత. గ్రుంకిపోతున్న పొద్దును ప్రాణాలు కోల్పోబోతున్న మనిషికి ప్రతీకగా తీసుకున్నారు.

అగ్రకుల, ఆస్తిపరుల దురహంకారానికి, కుళ్ళు, కుతంత్రాలకు బలయ్యే సామాన్యుని జీవిత గాథ 'వీరజాటి' కథ. గంగమ్మను నెత్తిన పెట్టుకుని, వీరజాటితో కొట్టుకుంటూ, పాటలు పాడుతూ, చిందేస్తూ, ఊరూరు తిరిగి భిక్షమెత్తుకుని జీవించే వృత్తి చేసే వ్యక్తి కోటప్ప. ఈ వృత్తి ఇతనికి వంశ పారంపర్యంగా సంక్రమించింది. ఈ పనితో వచ్చే సంపాదన కుటుంబ పోషణకు సరిపోక బంజరు భూమిని దున్ని, సాగుచేసుకుని జీవనం సాగిస్తుంటాడు. ఇతని పొలం పక్కనే ఇరవై ఎకరాల పొలాన్ని సాగుచేస్తున్న ధనికుడు, అగ్రకులం వాడు వీరనాయుడు. ఇతని వద్ద అవసరానికి అప్పు తీసుకుంటూ పొలం పండించేవాడు కోటప్ప. కొన్ని సంఘటనల వల్ల కోటప్పపై పగను పెంచుకుంటాడు వీరనాయుడు. ఈ క్రమంలో తన వద్ద అప్పు తీసుకున్న కోటప్ప నిరాక్షరాస్యుడు కావడంతో, తీసుకున్న అప్పు కంటే ఎక్కువ మొత్తానికి నోటు రాయించుకుంటాడు. దీనిని ఆధారంగా చేసుకుని అప్పుతీర్చలేని పరిస్థితిని గమనించి తీసుకున్న డబ్బుకు బదులుగా కోటప్ప పొలాన్నీ పొలంలోని పంటను ఆక్రమించుకోవడమే కాకుండా జీతగాళ్ళతో కొట్టిస్తాడు.

ఈ విధంగా వీర నాయుడి దురహంకారానికి కుయుక్తులకు మోసపోయిన కోటప్ప తిరిగి వంశపారంపర్యంగా వచ్చిన వృత్తినే నమ్ముకుని జీవనం సాగించాల్సిన పరిస్థితి వస్తుంది. ఈ స్థితికి కారణమైన వీరనాయుడు పాపం పండాలనే కోపంతో రగిలిపోతూ అతని ఇంటిముందు ఉగ్రరూపం దాల్చిన శివుడిలా చిందేస్తాడు కోటప్ప. అది చూసిన వీరనాయుడు ముఖంలో ఒక రకమైన భయం కన్పిస్తుంది. ఈ దృశ్యం చైతన్యవంతమవుతున్న అణగారిన వర్గానికి ప్రతీకగా వుంటుంది. ఈ సారాంశాన్నంతటినీ పాఠకుడికి సూచించడానికే 'సూర్యుడు గుండ్రంగా, ఎర్రటి మట్టిగడ్డిలా పుట్టుకొస్తున్నాడు' అనే ప్రతీకాత్మక వర్ణన చేశారు రాసాని. ఇందులో చైతన్యవంతులవుతున్న అణగారిన వర్గాలకు ప్రతీకగా కోటప్ప పాత్ర కనిపిస్తుంటే, కోటప్పకు ప్రతీకగా ఎర్రటి మట్టి గడ్డిలా పుట్టుకొచ్చే సూర్యున్ని వర్ణించారు రచయిత.

పగలు, ప్రతీకారాలతో కుటుంబాలను బలి తీసుకున్న మూర్ఖపు మనుషుల గురించి రాసిన కథ 'శనీస్పురుడు' రెండు కుటుంబాల మధ్య మొదలైన గొడవలు ఊరి మొత్తాన్ని రెండు వర్గాలుగా చేసి, కక్షలు, కార్పణ్యాలతో మానవత్వాన్ని మరచి,

## నానీలు

- బి. గోవర్ధనరావు
9441968930



మేఘమాల
వానపాట పాడింది!
ఆకుపచ్చని కల
భుక్తి పదమయింది!

ఆకు రాలింది
వసంతం ప్రేమకు
చెట్టు సొగసు
పచ్చని వెన్నెలయింది!

ఒకరు ప్రాణదాత
మరొకరు మహాదాత
గాలీ, నీరూ
ఇద్దరు, ఇద్దరే!

తొలి, మలి సంధ్యల్లో
సూరీడు!
చీకటి వెలుగులయినా
గతిని మార్చడు!

అక్కడ నువ్వు
ఇక్కడ నేను
పెళ్ళి పందిరిలో
ఇద్దరు ఒకటయ్యారు!

సఫాయి వాలా
ఇతనూ మనిషే!
విల్సన్, మీ ఆందోళనతో
మేమూ నడుస్తాం!

సెల్‌ఫోన్‌లో
మాటలక్కడ!
ఈ బిజీ తుఫాన్‌లో
మనసులు ఎక్కడ!

జాతీయక్రీడలో
నిండు చంద్రుడా
హాకీ మాంత్రికుడా
సెల్యూట్! ధ్యాన్ చంద్!

పత్తి పంటను
చూస్తే తెలిసింది!
రైతు జీవితం
దూదిపూల దుఃఖమంతని! ❋

---

జీవితాన్ని నిలువునా చీల్చుకున్న రక్తాక్షరి ఈ కథ. రాయలసీమ ప్రాంతంలో పగతో రగిలిపోయే ఫ్యాక్షనిస్టుల జీవిత గాథలకు దగ్గరగా ఉంటుందీ కథ. ఇటువంటి మొండి మనుషుల కక్షలకు ప్రతీకగా ఈ కథ ఎత్తుగడలో 'తూర్పున ధగధగ మండే అగ్గిబాణం మాదిర్తో ఎర్రగా నిగనిగలాడతా ఆకాసింలోకి పొడచకొస్తా ఉంటాది పొద్దు' అనే వర్ణన చేశారు. ఇందులో ఉపయోగించిన పదాలు పగతో రగిలిపోయే మనుషులను సూచిస్తున్నాయి. ఈ కథా వస్తువు మొత్తం ఈ వాక్యంలో ప్రతిబింబిస్తుంది. 'బసిరెడ్డి' పాత్ర చంపబడే ముందు "పొద్దు గూట్లో పడి, అప్పుడే శ్యానా సేపాయ" అనే వర్ణన ఉంది. మరణం తప్పదు అనే ప్రతీకాత్మక చిత్రణ ఈ వాక్యంలో కనిపిస్తుందని చెప్పవచ్చు.

అంతరించిపోతున్న సాంస్కృతిక కళలు, ఆదరణ కోల్పోతున్న కళాకారుల దీనస్థితికి నిదర్శనం 'పగటి తారలు' కథ. ఒకప్పుడు నాటకాలకున్న విపరీతమైన ఆదరణ ప్రపంచీకరణ ప్రభావం వల్ల గణనీయంగా తగ్గిపోవడాన్ని సూచించిన కథాంశం. కళాకారులు నమ్ముకున్న కళను వదిలిపెట్టి శరీర కష్టాన్ని ఆశ్రయించిన దీనస్థితిని తెలియజేసే కథ ఇది. ఎప్పుడో ఒకసారి కళామతల్లిని ఆదరించాలనే ఆలోచన ఏ పెద్దలకో వస్తే తప్ప కళాకారులకు గుర్తింపు లేదు. ఈ పరిస్థితులనన్నింటిని కూర్చి దిద్దిన రూపం ఈ కథ. ఇటువంటి పేద కళాకారుల దయనీయ స్థితికి అద్దం పడుతున్నట్లుగా అస్తమిస్తున్న సూర్యుడిని ప్రతీకాత్మంగా వర్ణించారు.

"పొద్దును తమ రెక్కలకు తగిలించుకొని ఎగురుతున్నట్లు రెండు కాకులు ఆకాశంలో పడమటి కొండలవైపు ఎగురుతున్నాయి.

"రోడ్డుపైన ట్రాక్టర్ లేపిన దుమ్ములో నుంచి అస్తమిస్తున్న సూర్యుడు కొండల వెనుకకు జారిపోతూ కనిపిస్తున్నాడు."

ఈ వర్ణనలో పడమటి కొండలవైపు జారిపోతున్న సూర్యుడు ఆదరణ కోల్పోతున్న సాంస్కృతిక కళాకారులకు ప్రతీక. నటనను నమ్ముకుని, రంగులమయమైన జీవితాన్ని గడపాల్సిన వారు ప్రపంచీకరణ పాద పీఠం కింద తలదాచుకోలేక రోజూవారీ బ్రతుకుబండిని రెక్కల కష్టంతో లాగుతున్నారనే ఆవేదన కన్పిస్తోంది.

సామాన్యుని జీవిత గాథల్ని వస్తువుగా స్వీకరించి, వాటిని కథలుగా మలచిన స్రష్ట రాసాని. వారి కథలలో వర్ణించిన సూర్యోదయ, సూర్యాస్తమయ అంశాలను బడుగువారి జీవితానికి ప్రతిబింబాలుగా పై కథల ద్వారా ప్రతీకాత్మకంగా సమన్వయం చేశారు. ఇదొక నేర్పరితనం, కథను చెక్కడంలో కనిపించే నిర్మాణ నైపుణ్యం, ఆలోచనాత్మక వర్ణనలతో కథను నిర్మించే కథా నిపుణుడు రాసాని అనడంలో సందేహం లేదు. ❋



# గుండెబరువుల్ని తేలిక పరిచే కవిత్వ పరిమళం

- నందవరం కేశవరెడ్డి
9885120878

మనిషి వినిమయ వస్తువుగా మారిన ఈ కాలంలో మానవ సంబంధాలు పెలుసు బారాయి. అన్ని దురవస్థలకూ కారణమైన డబ్బు, సెక్సు, మతం ఉచ్చులలో పడి మనిషి తండ్లాడుతున్నాడు. అర్థరాహిత్యం, శూన్యత, ఒంటరి తనాన్ని మోసుకుంటు మనిషి జీవితం కాలం కత్తుల వంతెన మీద సాగుతుంది. తుఫాను నడి సముద్రంలో ఏకాకి నౌకలా కొట్టుకునే మనిషికి చేయినందిస్తు కన్నీళ్ళను తోడిస్తూ, తల్లిలా ప్రేమతో తనలోకి తాను చూసుకునేలా చేసి జీవన సౌందర్యాలను దర్శింపచేస్తు, సాటి మనిషి విలువను గుర్తించేలా వెలుగును పంచి గుండె బరువుల్ని తేలిక పరుస్తుంది కవిత్వం.

ఒంటరితనంలో మునిగి పోయిన మనిషిని కలిసి భుజం మీద చెయ్యేసి హత్తుకుంటానంటారు తన 'ఒంటరి' కవితలో కె.శివారెడ్డి.

'నేనిపుడే వస్తా/ ఒక మనిషిని కలిసి/ ఒంటరి ననుకుంటున్న ఒక మనిషిని కలిసి/ పరమ ఏకాకి తనంలో మునిగి పోయిన/ ఒక మనిషిని కలిసి ఇప్పుడే వస్తా" నంటూ కవి ఆ ఒంటరిని కలిసి "అలా చేయి పట్టుకు కూచుంటా/ భుజం మీద చెయ్యేసి హత్తుకుంటానంటారు. ఆ స్పర్శానుభూతిలోని మధుధారలు గుండెల్లో కలుస్తున్నప్పుడు మాటలు రావు. వచ్చినా వ్యక్త పరచడానికి అని చాలవు. అందుకే కవి అంటారు.

'మాటలు నిరర్థకమైనప్పుడు
స్పర్శ మాట్లాడుతుందనుకుంటా"

కవిత్వ పరిమళం గుండెల నిండా పరచుకోగా ఒంటరి, నేను ఒంటరిని కాదు. నాకూ ఆప్తులు, ఆత్మీయులు ఉన్నారు. అనుకుంటూ గాలిలో తేలి పోతాడు. ఒంటరి తనంలోని బాధలూ, దుఃఖాలు చేతితో తీసివేసినట్లు ఫీలయి పరవశించి పోతాడు. బాధల్లో ఉండే వారి బాధలు, బాధల్లో ఉండే వారికే తెలుస్తాయి అంటారు. ఇక్కడ కవి కూడా ఒంటరే. అందుకే ఒంటరిని కలవడానికి 'అంతదూరం పోయి, నన్ను నేను కలిసి వస్తానేమో' అని అంటే కళ్ళు చెమ్మగిల్లుతాయి.

బ్రతుకు బాటలో, కాలికి తడి తగలని వారు కంటనీరు పెట్టనివారు లేరేమో' ఆత్మీయులు, వెలితిని పూడ్చలేనంతటి దగ్గరి వారు దూరమైనప్పుడు జల జల కన్నీటిని రాల్చుతాం, భోరున యేడుస్తాం. అలా జాలువారిన కన్నీళ్లే హృదయ భారాన్ని తగ్గిస్తాయి. తిరిగి మామూలు మనిషిగా నిలదొక్కుకునేలా చేస్తాయి. ఈ సత్యాన్ని తెలిసిన శివరెంక రాజేశ్వరి దేవి తన 'కన్నీళ్ళు లేకపోతే ఎలా బతికేది/ గుండె బరువును ఎలా తేలిక చేసుకునేది" అంటూ గుండె బరువును తగ్గించుకోవడానికి కన్నీళ్ల అవసరం చెప్తారు. బండబారిన వారు మన చుట్టూ ఉన్నారు. అలాంటి వారి గుండె లోతుల్లో కూడా నీటి చెలమలున్నాయి. ఆ కన్నీటి బావిలోతు తెలుసుకోవలసిన అవసరముంది. అప్పుడే బరువు లేని

జీవితం మనదవుతుంది అంటారు కవయిత్రి.

సాధారణంగా దుఃఖాలన్నీ మనం తెచ్చి పెట్టుకున్నట్టే. ప్రేమంటే తెలియనివారు చూపు కలయికలోనో, మేను కదలికలోనో ఆమె ఇష్టపడుతోందనుకుని ఆమె చుట్టూ ఊహల్ని అల్లుకుంటు, ఆ ఊహలపై మేనువాల్చి, విశ్రాంతి కోరు కోవటం అపరిపక్వ మానసిక స్థితినే సూచిస్తుంది అంటారు.'నువ్వే ఇన్ని అయ్యావని కవితలో బివివి ప్రసాద్ ఉద్వేగాలు సృజించిన ఊహలన్నీ హృదయ వేదనల్ని పెంచుతాయి. చివరికవి 'నేల వాలిన ఆకాశం పొగమంచై కరిగి పోయాక పూల రేకులపై నీటి బిందువుల చారికలా నీకు నువ్వే మిగిలేలా చేస్తాయి. గుండె పగిలేలా చేస్తాయి. ఆ స్థితి దాపురించకుండా కవి, అర్థం చేసుకునేలా చెప్తారు.

'పోయేవన్నీ పోగా మిగిలేదేమిటనే

గణితం సరిగా అర్థమైనప్పుడు అంకెలన్నీ సున్నాలోకి మరలి పోయినట్లు

పోగొట్టు కున్న నీ ప్రాణాలన్నీ నీలోకే తిరిగి చేరతాయి" అప్పుడు నేనే ఇవన్నీ అయ్యానని స్పష్టంగా తెలుసుకొని, తనలోకే తాను వాలి, నిర్మల స్పటికం వంటి విశ్రాంతి పొందుతాడు. గుండె బరువులన్నీ తేలికవుతాయి. జీవితం పరిమళిస్తుంది.

గాయపడిన ఇంకో గుండెలోకి ప్రవేశించి, పలకరించి, కనీసం ఒక అరచుక్క కంటతడిని రాల్చగలిగే సంబంధాల్ని పెంచుకోగలిగినప్పుడు మాత్రమే గుండె బరువులు తేలిక పడతాయని అఫ్సర్ 'నేల కంపిస్తుందని తెలియని నీకు...' కవితలో చెప్తారు.

అందంగా అన్నీ అమరిన వారికి, ఎప్పుడూ తమ కాళ్ళ క్రింద భూమి వణికి పోలేదు కాబట్టి, జీవన్మరణ ప్రకంపన లేవీ తెలియవు కాబట్టి వారికి వారి ముఖమో ఆ అవతలి ఇంకొక ముఖమో తెలియనే తెలియదు. ఒక భాధలో, ఇంకో ఒంటరి తనంలో మరింకో చావు కన్నా పీడలాంటి బతుకులో యేది యెందుకు యెలా కమ్ముకొస్తుందో వీరి వూహకి కూడా అందదు. ఇలాంటి వారు ఎక్కాల్సిన మెట్టు చూస్తూ వుండగానే జారిపోయినప్పుడు గుండెలు బాదుకుని ఏడుస్తూ వుండి పోతారు తప్ప, ఇంకో గుండెలోకి ప్రవేశించి అక్కడి గాయాన్ని పలకరించి రాలేరు. చేతుల్లోంచి పట్టు తప్పి జీవితం జారిపోకుండా, వేదనల పాలు కాకుండా, ముందస్తుగా తెలియజేసి, బరువులేని జీవన గమనం వైపు అఫ్సర్ కవిత నడిపిస్తుంది.

**_చేతుల్లోంచి పట్టు తప్పి జీవితం జారిపోకుండా, వేదనల పాలు కాకుండా, ముందస్తుగా తెలియజేసి, బరువులేని జీవన గమనం వైపు అఫ్సర్ కవిత నడిపిస్తుంది._**

ఎదురు చూపులోనో, యెడబాటులోనో ఒంటరిగా ఫీలవుతు వేదనా బరువుల్ని మోసేకంటే, క్షణ క్షణాన్ని అనుభూతిస్తూ ప్రకృతి సోయగాల్ని ఆస్వాదిస్తూ గడిపినప్పుడు తేలిక పడతాం. తేట దేరుతాం. 'నిషిగంధ'లో 'రెండే ఋతువులు నాకెప్పుడూ' కవిత ఆహ్లాదకర పరిసరాల పరిమళాన్ని మన సొంతం చేస్తుంది.

అతడి కోసం ఎదురు చూస్తూ ఆమె 'తలుపులన్నీ బార్లా తెరిచి/ ఆ మూల ఈ మూలా రెపరెపలాడుతున్న చీకట్లని ఊడ్చి తుడిచేసి సగం రాసిన ఉత్తరాలన్నీ సర్దిపెట్టి/ అదే పనిగా ఎదురు చూడలేక ఆమె గుమ్మానికి కనురెప్పల్ని అతికించి వదిలేస్తుంది. దృశ్యం హృదయాన్ని ఆకట్టుకుంటుంది. కవిత వెంట చూపులు పరిగెత్తుతాయి.

ఆకాశం ఆ కనిపించే నల్లటి కొండల వెనగ్గా వెళ్ళి

నీలాన్ని కొంచెం కొంచెంగా ఒంపేసుకోకముందే వచ్చేశావనుకో.... వస్తూ వస్తూ... రహస్య రాత్రుళ్ళకి అనిర్వచనీయమైన మధు రోహల డోలిక పరిమళించిన మనసు.

ప్రకృతికి దూరమైన మానవుడు అనేక దురవస్థల పాలయ్యాడు. పంట పొలాలు, చెట్టు చేమలు, వంకలు వాగులతో పచ్చని పల్లెలు పట్టణాలయ్యాయి. నగరాలయ్యాయి. అంతటా కాలుష్యం ఉదర వ్యాధులు, శ్వాసకోస వ్యాధులు గుండె జబ్బులు మనిషిని పట్టి పీడిస్తున్నాయి. రొదలూ, రోదనలూ వదలి ప్రకృతి చెంతకు పోదాం. ఈ గుండెలను కోనలుగా మార్చేందుకు ఒక్క ఉషోదయం చాలు అంటున్నారు సీతారాం తన 'సాగి పోతాం' కవితలో. రహదారులను మీకే విడిచి, మీ నగరాలను మీ ఇళ్ళముందే కట్టేసి మీ ఫ్యాక్టరీలను మీ పొగ గొట్టాలను, మీ క్రానిక్ బ్రాంకైటీస్‌లను, మీ ఉదర వ్యాధులను మీకే రాసిచ్చేసి ఒక ఉషోదయం చాలనుకుంటే, అరణ్యధ్యాన సౌందర్యాన్ని చూడగలుగుతాం. మౌన వనాలు, నిశ్శబ్ద వృక్షాలు మన మాటలవుతాయి. అప్పుడు గుండె బరువులు తేలిపోయి. ఆరోగ్యం పరిమళిస్తుంది.

భూమి, అమ్మ, ఆకాశం, నాన్న నాలుగు దిక్కులు స్నేహితులు ప్రకృతే కుటుంబం. కుటుంబమే ప్రకృతి. అప్పుడే కవితలో రవి వీరెల్లి

# రెక్కలు

- బండి ప్రసాదరావు
9866483732



ఇంటికో జాబు
వ్యయం పద్దు.
ఇంటర్నెట్
ఆదాయ మార్గం–
జాబ్ మాయం
కనెక్షన్ ఖాయం !

మైనర్లపై
మూకుమ్మడి;
విద్యార్థినిలపై
వేధింపుల పర్వం–
మెగా నినాదం
బేటీ బచావో!

వారు
మురుగు చేసారు
మీరు
దయచేయండి–
త్రివిధ మాలిన్యం
తయారీ హబ్!

నాడు
నిర్మల్ భారత్
నేడు
స్వచ్ఛ భారత్–
సీసా కొత్తది
సరుకు పాతదే!

గతపుగొప్పలే
ప్రస్తుతం లేక
అసంబద్ధంగా
కిరాయి చప్పట్లు–
చౌక బారింది
సభా వేదిక!

నిరంతర అవసరాలు
మూడంకెలు;
నిత్యావసరాలు
నాలుగంకెలు–
ఉబ్బితబ్బిబ్బు
రెండంకెల వృద్ధి! ❋

---

మట్టి చీరను మోకాళ్ళ వరకు మలిచి
మెత్తటి తన కాళ్ళపై సముద్రాన్ని బోర్లా పడుకోబెట్టుకొని
నలుగు పెడుతుంది భూమి.

మరి నలుగు పెడుతుంటే అల్లరి శిశువు సముద్రం కుదురుగా ఉంటుందా, ఉండదు. పొంగినా పొర్లినా/ ఆఖరికి హద్దు మీరినా/ అన్నీ మరిచి హత్తుకుంటుంది అమ్మ / భూమి తీరం అమ్మ వొడి / గుండెల నిండుగా కవిత్వ పరిమళం 'భూదేవి నా తల్లి/ సముద్రం నా తోబుట్టువు/ ఓక్షణం ఉరిమి/ మెరుపు బరిగెతో అరచేతిపై ఒక్కటిచ్చి/ వెంటనే వర్షంతో దిగొచ్చి/ వొళ్ళంతా ప్రేమగా తడిమే ఆకాశం/ మానాన్న, ఏ దిక్కులేని/ నాలుగు దిక్కులు/ నా నేస్తాలు, అనుకుంటే చింతలు లేని జీవనం మనదౌతుంది.

నిరాశ నిస్పృహలతో కొట్టు మిట్టాడుతూ ఆనందానికి దూరమైన మనిషిని ప్రేమమటుకే బ్రతికిస్తుందంటారు ఆకెళ్ళ రవి ప్రకాష్ తన 'ప్రేమ మటుకే' కవితలో

'మనమంటే ఏమిటో
వెలుగంటే ఏమిటో
ప్రేమమటుకే తేటతెల్లం చేస్తుంది.' అంటూ
'నిజానికి ప్రేమించడం అంటే
మన చుట్టూ మనం నిర్మించుకున్న
కారాగారాల గోడల్ని కూల్చడమే'

సరళమైన జీవనానికి దారి చూపుతూ, ప్రేమ పరమార్థాన్ని బోధ పరచింది ఈ కవిత.

భౌతిక అవసరాల కోసం మనుషుల మధ్య అమానవీయ సంబంధాల సమాజంలో ఉన్నాం. మనల్ని మనల్నిగా అభిమానించే ఆదరించే మనసున్న మనుషులు కరువవుతున్న సందర్భంలో బతుకీడుస్తున్నాం. చివరికి వచ్చే వాళ్ళు ఎవరో ఎవరికీ చివరిదాకా తెలియదు. అలా తెలుసుకోవాలనుకుంటే ఆసుపత్రులను చూసి రావాలంటారు పలమనేరు బాలాజీ తన 'వెంట వచ్చే వాళ్ళు వెంటవుండే వాళ్ళు' కవితలో

దేవాలయాలకు ధ్యానం కోసమో
మోక్షం కోసమో వెళ్ళినట్లు, ఉద్యానవనాలకు
విహారం కోసమో
విశ్రాంతి కోసమో వెళ్ళినట్లు
మనుషులు అప్పుడప్పుడు ఆస్పత్రులకు కూడా వెడుతుండాలి మంచాలపైన బాధలు, శోకాలు ఎవరివో మంచం చుట్టూ
ఓదార్పులు, ఉపశమనాలు, పరిచర్యలు ఎవరివో కొంచెం చూసి రావాలి.

కవి 'భూమ్మీద పడినప్పుడు కన్నా, మంచం పైన పడినప్పుడే మనిషికి మనిషి విలువ కాస్తయినా తెలిసి వస్తుంది. అంటారు. ఇంకా మనుషులు గురించి తెలుసుకోవాలనుకుంటే ఆస్పత్రులను అడగాలి అంటారు.

"కన్నీరు తుడిస్తే కన్నీరు నేల రాలడం
కంట కన్నీరు కనబడితే–
కళ్ళు దుఃఖపు వాకిళ్ళు కావటం
ఒకరి నిద్రకు– వేరెవరో మెలకువ కావటం
మనుషుల్ని బ్రతికించుకోవాలనే తపన పోరాటం
ప్రేమ దయ మరికొన్ని, నిలువెల్లా కనిపించేదే
ఆసుపత్రి" మనుషులెంతటి విలువైన ఖనిజాలో

బరువులుందని, బాధలుందని, చింతలుందని నంతలుందని ఒకే ఒక ఆవరణం కవిత్వ పరిమళావరణం.

❋

# కొత్తపాఠము



- నామని సుజనాదేవి
7799305575

నెల చివరి రోజు కావడంతో ఎప్పటిలాగానే ఆఫీస్ లోనే చాలా ఆలస్యం అయిపోయింది. అందుకే పదిన్నరే కదా ఆటోలు ఉంటాయి. నే వేళతాను అంటూ మా సార్ వారిస్తున్నా వినకుండా బయటకు వచ్చేశాను. రెండు మూడు ఆటోలు రామంటూ వెళ్లిపోయాయి. ఒక అతను వస్తానన్నాడు. ఎక్కి కూర్చున్నాను. కొంచెం దూరవెళ్ళాక మరొకతను దిగిపోయారు. ఎవరూ ఎక్కలేదు. ఆటోలో ఒక్కదాన్ని ఉన్నాను. ఆటో డ్రైవర్ వైపు చూశాను. చిన్నవాడే. 25 సంవత్సరాలుంటాయేమో. పాసింజర్ ఒక్కరే ఉంటే, దారి మళ్ళించడం ... అత్యాచారం ... తదితర పేపర్ న్యూస్ కళ్ళ ముందు తిరిగాయి. సెల్ పట్టుకున్నాను. సెల్ మోగింది.

'హలో ... ఆ ... హన్మకొండ దాటాను ... వస్తున్నాలే ...టర్నింగ్ వరకొచ్చాను. ఇంట్లో పాలు విరుగుతాయేమో ... ఒక్కసారి మరిగించండి ... ఆటోనెంబర్ 2525 ... మనింటి ప్రక్క ఎస్ఐ గారిని కొంచెం ఇల్లు చూస్తుండమని మీరైనా అతనైనా రోడ్ వరకు రండి.... మరేం ఫర్లేదు.. అంటూ మా కాలనీ రాగానే ఆపమంటూ దిగి డబ్బులిచ్చాను. అక్కడనుండి లోపలికి దాదాపు ఒక 7 నిమిషాలు నడవాలి. కొత్తగా ఇల్లు కట్టుకుని వచ్చాను ఆ కాలనీకి .... రోడ్ నుండి సందులోకి తిరిగాను ... ఆ సందు చివర వరకెళ్లి మరో సందు తిరిగితే మా ఇల్లు వస్తుంది. కొత్తగా పడ్డ కాలనీ కావడంతో విసిరేసినట్లున్నాయి ఇల్లు. వీధి లైట్లు లేక గుడ్డి వెలుతురు లో నిర్మానుష్యంగా ఉన్న రోడ్లు భయం గొల్పుతున్నాయి. ఏదో క్షేమంగా ఒక రోజు చేరగలిగానని సంతోషపడ్డాను. కానీ అంతకు మించిన ప్రమాదం పొంచి ఉందని గ్రహించలేకపోయాను. ఇలా సందు తిరిగానో లేదో ఆ సందు మొదట్లో దారి ప్రక్కగా నిలబడ్డ ఇద్దరు అడుగుల శబ్ధానికేమో నన్ను చూశారు. నేను వూహించలేదేమో భయపడ్డాను. అయినా ఏమీ గమనించనట్లు నడవసాగాను. దారి కిరువైపులా పిచ్చిగా పెరిగిన చెట్ల తుప్పలున్నాయి. చలి కాలం కావడం వల్లేమో చుట్టూ ఉన్న నాలుగైదు ఇళ్ళల్లో కూడా లైట్లు ఆర్పేసి తలుపులు పెట్టేసి ఉన్నాయి. ఒకటి రెండు ఇళ్ళలో ముందున్న చిన్న లైటు వెలుతురే ఆ సందులో కాస్తంత వెలుగునిస్తోంది. నేను వెళుతుంటే నా వెనకాలే వస్తూ 'ఆరరే...ఏం ఫిగరు...అచ్చం శ్రీదేవిలా ఉంది బాసు ....' అంటూ దగ్గరకొస్తున్నారు. పరుగెత్తితే ఎలా ఉంటుందో...అప్పుడే వాళ్ళు పరుగెత్తారు...నా ముందుకొచ్చి ఒకడు నోరు మూశాడు. నోరు మూసినవాడు, మరొకడు కలిసి ప్రక్క నున్న చెట్ల వైపు లాక్కెళుతున్నారు. ఆ హఠాత్పరిణామానికి గుండె ఆగినట్లయ్యింది. ఒక్క నిమిషం ముందయినా మేల్కొని పరుగెత్తని నా బుద్ధి మాంధ్యానికి తిట్టుకుంటూ, ఎంత గింజుకున్న వారి పశుబలం ముందు నేను

బలహీనురాలినవుతున్నాను, కొని క్షణాలు ఆలోచించాను. వెంటనే గింజుకోవడం ఆపేశాను. ఈలోగా తుప్పల్లో చెట్టు లాంటి ప్రదేశం దగ్గర ఆగారు. నేను గింజుకోవడం ఆపేయగానే ఆశ్చర్య పోయినట్లున్నారు. "గిదెందిరో. ఈ పోరికి కూడా ఇష్టముందేమో. ఏమో...ఇయ్యాళ్లేవు ఇవి కామనై పోయినాయి." వెంట వచ్చిన వాడు వెకిలిగా నవ్వుతూ అంటున్నాడు. ఇద్దరి దగ్గర లిక్కర్ వాసన గుప్పుమంటుంది. ఆ వాసన భరించడం వారిని భరించడం చాలా కష్టంగా ఉంది. వారి చేతులు నోటిపై ఉన్నందున వొళ్ళంతా కారం రాసుకున్నట్లు, గొంగళి పురుగులు పారినట్లు అనిపిస్తుంది.



ఆశ్చర్యపోయినపుడు కొంచెం సడలిన చేతిని బలవంతాన నా చేయితో నోటిపై నుండి తీసిశాను. "అరె...ఏం చేస్త్రా...ఏం చేస్తారు... పండి పోయి ఉన్నాను.... తరగని రోగం అంటించుకోవాలని అంత కోరిగ్గా ఉంటే రండి... ఎయిడ్స్‌దాన్ని నేనొక్కదాన్నే కాక..మరో ఇద్దరు తోడు దొరుకుతారు... అందరం కల్సి వాడొచ్చు మందు ... రండి...రా.... ఇంకోసారి జన్మలో ఆడదాని మొహం చూడకుండా అవుతారు. రండి...." ఆవేశంలో వూగిపోతూ నేనంటుంటే....వాళ్ళు ఒక్క క్షణం బిత్తర పోయారు. వాళ్ళు నన్ను వదిలేసినా పారిపోయే ప్రయత్నం చేయలేదు. ఎందుకంటే ఎంత పరుగెత్తినా ఆ తుప్పల్లో నుండి రోడ్ పైకి వచ్చి రక్షిస్తారన్న ఆశ లేదు. పైగా ఆ చుట్టు ప్రక్కల ఇల్లు లేవు... అందుకే ధైర్యంగా చీకట్లో బాణం విసిరాను.

'ఇదెక్కడి గోలరా బాబూ .... అబద్ధం చెబుతుందేమో తప్పించుకోవడానికి... అనుకుంటే.... ఒకవేళ నిజమైతే బతుకు బస్టాండవుతుంది.... ఎందుకొచ్చిన గోల అసలే పరిస్థితులు ఇదివరకులా లేవు .... ఏదో.... ఇలా జరిగింది, ఎవరికైనా తెలిస్తే నాకే పరువు తక్కువ నా ఇజ్జతి పోతదనీ ఏ ఆడది అనుకుంట లేదు... ఇదివరకయితే ఎవరికీ తెలీకుండా గుట్టుచప్పుడు కాకుండా ఉండేటోల్లు...ఇపుడు...ఓరినీ... అదేదో హక్కులాగా ప్రతీదీ పోలీసు స్టషన్ కి వెల్లడమో...రిపోర్టులు...ధర్నాలు...అసలే చట్టమ్ కింద ఏకీ పారేస్తున్నారట...బతికుంటే బలుసాకు తినొచ్చు...... ఇలాంటివెన్నైనా చేయొచ్చు... పరుగెత్తరా బాబూ..నే వెళ్తున్నా బాబోయ్....." అంటూ ఒకడు తుప్పల్లో నుండి పారిపోయాడు. మరొకడు అంత తొందరగా నమ్మలేదు.."గదేదో పోరి ఉ షారుండి ఏదో గట్ల భయపెట్టి స్తే భయపడతావురా.... మొగొనివి కాదురా...రేషమ్ లేదురా...భయపడ్డానికి నేనేమైనా పిరికోన్నా..." అంటూ వాడిని తిట్టేసి మీదకొస్తున్నాడు.. ఇక ఆగలేదు నేను. ఆ తాగిన వాసన భరించడం దుర్భరంగా ఉంది. చేతుల్తో బలంగా నెడుతూ శక్తినంతా కాలులోకి కూడదీసుకుని వాడి రెండు కాళ్ళ మధ్య గట్టిగా లాగిపెట్టి తన్నాను. ఆదాటున ఉన్నాడేమో..నేనలా చేస్తానని వూహించనందున కింద పడ్డాడు. పైగా చలికాలం కావడంతో నేను షూ వేసుకుని ఉన్నందున దెబ్బ బలంగానే తగిలుంటుంది. పైగా ఈ దాడి వాడు వూహించనిది. అంతకు ముందు మాటలు, వాడి పారిపోవడం తర్వాత ఇలాంటి సన్నివేశం కలలో కూడా వూహించనిది కావడంతో అంత అప్రమత్తంగా లేడు. పైగా ఏదో అన్నానేగాని, నాకు విపరీతమైన భయంగా ఉంది లోలోన...ఒకవేళ ఆ క్షణం లో ఈడ్చి తన్నే దెబ్బ ఏ మాత్రం అటూ ఇటయినా ఇక నా జీవితం ఎంత ఘోరంగా ఉంటుందో తెలిసినందున చాలా జాగ్రత్తగా దెబ్బకొట్టాను. ఆ దెబ్బకు 'అమ్మా' అంటూ ఆ తుప్పల్లోనే కింద పడి రెండు కాళ్ళ మధ్య ఆయువుపట్టు పై రెండు చేతులతో పట్టుకుంటూ కూలబడ్డాడు. ఇక ఆలస్యం చేయలేదు. ఒక్క క్షణం మరో రెండు తన్నులు లాగి గట్టిగా తన్ని వాయువేగంతో కింద పడిన హాండ్ బాగ్ మెడకు తగిలించుకుంటూ పరుగెత్తాను, రోడ్ నుండి పరుగులంకిస్తూ 'హెల్ప్' అంటూ అరిచాను. నా అనుమానం నిజమే...ఎవరూ రాలేదు....కానీ పొరపాటున వాడు రికవర్ అయి కోపంతో మళ్ళీ వెంటబడతాడు...పరుగెత్తుతుంటే చుక్కలు కనబడ్డాయి. అయినా జీవన్మరణ సమస్య అన్నట్లు పరుగాపలేదు. ఆ సందు తిరగ్గానే మా వీధిలో నాలుగైదిళ్ళ తర్వాతనే మా ఇల్లు కావడంతో ఇల్లు చేరి గేట్ తీసి, కారిడార్ లో క్రిందనే కూలబడ్డాను. విపరీతంగా వగరుస్తున్నాను. అంత చలి లో కూడా భయం వల్ల, పరుగెట్టడం వల్ల చెమట్లు కారిపోతున్నాయి....

ఇంట్లో నా కోసం ఎదురుచూస్తూ చదువుకుంటున్న నా కూతురు, అత్తయ్య గేట్ తీసిన శబ్దానికి తలుపు తెరుచుకొని

# రెక్కల తాకిడికి

- సయ్యద్ జహీర్ అహ్మద్
9505152560



ధర పయోధరాన్ని చుంబిస్తుంటే
సగటు మనిషి రెక్కలు శకలాలవుతున్నాయి
జీవచ్ఛవ కళేబరానికి ఊతంలా పింఛను
రెంటు లైఫ్‌కు కరెంటు షాకు
పప్పుధాన్యాలకు రెక్కలు
పురోగతి చిత్రపటంలో
సోపానరేఖా మాయాజాలం
జెర్రిపోతులా ఎగబడుతోంది
అనవసర సరుకుకు కల్పన దాడిచేసి
దోపిడీ చేస్తోంది
ధనం ఇంధనమై సాగు చేస్తుంది
పంట పొలాల్లో ప్లాట్లు మొలుస్తున్నాయి
పాపిష్టి డబ్బుకు చిరకాలం జబ్బులే
సూపర్ స్పెషాలిటి హాస్పిటళ్ళు
నోళ్ళు తెరుచుకొని నిరీక్షిస్తున్నాయి
విపణి వీధిలో వరదతాకిడి
ఈతగాడి ప్రతిభ అవుతుంది అప్రతిభ
జీతగాడి నిరీక్షణ వేటకుక్క ప్రహసనం
సగం కడుపు కోత సగం గుండె కోత
ఆకలి పులి గాండ్రించినా బోనులో ముక్కపడదు
తొలి జాము కూతపెట్టినా కునుకు తలుపు తట్టదు
రొట్టె మాడినా పేగు కాలిన వాసనే
రగిలేది కాష్ఠమైన బూడిదే పరాకాష్ఠ
పెరుగుదల ఆకాశానికైనా కృంగుదల అవనిపైనే. ❋

---

బయటకొచ్చి నేను కూర్చున్న తీరుకు రేగిన నా జుట్టు, చెమటకు తడిచిన బట్టలు, కారుతున్న చెమట చూసి భయపడింది.

'అమ్మా...ఏం జరిగిందమ్మా...' ఆదుర్దాగా అడుగుతోంది అత్తయ్య. నా తలను తన గుండెలపై పెట్టుకుంది అసరా ఇస్తున్నట్లు.

మా వారు ఉద్యోగరీత్యా వేరే వూర్లో ఉంటారు.... వారానికి ఒకసారి వచ్చి పోతుంటారు. ఇంట్లో పాప, అత్తయ్య నేనే ఉంటాము. ప్రొద్దుటే పాప స్కూల్కెళ్ళిపోతుంది. నేను ఆఫీస్ కి వెళతాను. ఆటోవాడే ప్రొద్దున్న, సాయంత్రం, మా కాలనీలో ఉన్న పిల్లలతో పాటు మా పాపను కూడా స్కూల్‌లో దింపుతాడు, తీసుకువస్తాడు. కాబట్టి పాప గురించిన టెన్షన్ లేదు. చుట్టుప్రక్కల ఉన్న రెండు కుటుంబాలు చాలా మంచివి. అవి తప్పితే మిగతా ఇల్లు విసిరేసినట్లు ఉంటాయి. ఆటోవాడు ఏం చేయకుండా,సెల్ఫ్ రింగ్ ఇచ్చుకుని మా వారితో మాట్లాడుతున్నట్లు సెల్ లో మాట్లాడాను. వాడిని భయపెట్టడానికి ఈ ప్లేస్ కొచ్చాను అంటూ జాడలు చెప్పాను. పైగా ఇంటిపక్క ఎస్ఐ ఉన్నాడన్న కలరింగ్ ఇచ్చా....

'అమ్మా....ఏం జరిగిందమ్మా...ఆర్ యూ ఆల్‌రైట్' కుదుపుతూ, దగ్గరకొచ్చి హాండ్ బాగ్ తీసి పక్కకు పెడుతూ నా పక్క కూర్చుంటూ అడుగుతోంది పాప. అత్తయ్య లోనికెళ్ళి నీళ్ళు తెచ్చింది. ఇపుడు నాకు జరిగిన సంఘటన ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న పాపకి చెప్పాలా వద్దా అంటూ ఒక్క నిమిషం తటపటాయించినా అంతా చలిలో చమట్లు కక్కుతున్న నన్ను చూసి ఆదుర్దాగా చూస్తున్న దానిని చూస్తే నాకు చెప్పాలనే అనిపించింది. ఎందుకంటే ఒక నిర్భయ అనవసరంగా ఒక మగ తోడు ఉండి కూడా, సురక్షితమైన బస్ లోనే ఎక్కినా సమిధయ్యింది. మరో అభయ అంతగా బయటి ప్రపంచం లో జరుగుతునవన్నీ తెలిసినా అమాయకంగా ఆహుతయ్యింది. అందుకే నాకూతురికి మార్షల్ ఆర్ట్స్ లో శిక్షణ ఇప్పిస్తున్నా, పైగా లోకం పోకడలు వారిని ఒక్కోసారి యుక్తితో బెదిరించో ఎలా ఎదుర్కోవచ్చో తల్లిగా నేను చెప్పకపోతే ఇంకెవరు చెబుతారు అనిపించి, ; ఏం లేదురా....బంగారు తల్లీ జీవనసమరమ్ లో ఓ రోజు అనే పాటం ఈ రోజు చెబుతాను' అంటూ ఫ్రెషప్ అయి క్షేమంగా చేరుకున్నానని మా సార్ చేసిన కాల్ కి రిప్లై ఇచ్చి, 100 కి డైల్ చేసి విషయం చెప్పి మా అమ్మాయికి పాటం మొదలెట్టాను. జరిగిన సంఘటనతో పాటు ఇటీవల ఒక యువతి బాగ్‌లో చిన్న కత్తిని ఆత్మ రక్షణార్థం ఉంచుకున్నది చెబుతూ, కనీసమ్ కారం లాంటి వైనా దగ్గరుంచుకుని తప్పించుకునే ప్రయత్నం చేయాలని 'హార్డ్ వర్క్ కాకుండా స్మార్ట్ వర్క్' చేయాలంటూ చెబుతూ పోయాను. ❋

# జీవన గమనంలో సంజీవదేవ్

- బి.లలితానంద ప్రసాద్
9247499715



*వారింటికి ఎక్కడెక్కడినుంచో వచ్చే పత్రికలు, ఇంటివద్దే విద్య సలిపిన ఉపాధ్యాయులు అన్ని విధాలా ప్రేరకులు. అప్పటివారి సంపన్న కుటుంబవాతావరణం వాటిపై అభిలాషను పెంచాయి. ఆ విధంగా జరిగిన బీజావహం తర్వాత్తర్వాత వృక్షమై, శాఖోపశాఖలై అక్షర, చిత్ర, స్వర (వక్త) రూపాల్లో అవని అంతా విస్తరించింది. ఆసక్తి, అభిరుచి గల రస హృదయాల సేద తీర్చింది. తీరుస్తూనే ఉంది. అవే పరిస్థితులూ, నేపథ్యం ఉన్న వారందరూ అలా రూపొందలేరు. అదే సంజీవ్‌దేవ్ ప్రత్యేకత, విశిష్టత, ఉత్కృష్టత.*

ఆయా సందర్భాలలో గతించిన మహోన్నతుల్ని గుర్తు చేసుకుంటూ ఉంటాము. నిజానికి వారిని ఆయా రూపాల్లో మరింతగా తెల్సుకోవాలి. అందుకు ప్రయత్నించాలి. పురోగతికి పురిగొల్పాలి. ఈ తెల్సుకునే ప్రయత్నంలో కొందరి గురించి ఎంత తెల్సుకున్నా (అనుకున్నా) ఇంకా కొంత మిగిలే ఉంటుంది. అటువంటి బహుకొలదిలో 2014లో శతజయంతి పూర్తి చేసుకున్న సంజీవ్‌దేవ్ (సం.దే) ఒకరు. వారి జీవన గమనం, విశిష్ట వ్యక్తిత్వం అనన్య సామాన్య బహుముఖత్వం, పరిణతి, సంయమన సమన్వయం, తారతమ్య రహిత లేఖామిత్రత్వం, వివక్ష రహిత విస్తృత స్నేహవల్లరి, అరుదైన జీవనం వగైరాలెన్నొన్నో అందరికీ అన్నివేళలా ఆచరణీయాలు, మార్గదర్శకాలు విశిష్ట, రసాత్మక వైవిధ్య రచనలతో పాటు.

సంజీవ్‌దేవ్ జన్మించింది, ఆజన్మాంతం జీవించిందీ గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలం తుమ్మపూడిలో. తల్లి తన చిన్నప్పుడే మరణించింది. పెంపకం రెండు చోట్ల తుమ్మపూడి, అమ్మమ్మగారి ఊరు కృష్ణాజిల్లా కోనాయపాలెం. తల్లిలేని పిల్లవాడగుట వల్ల గారాబంగా. తాను అమితంగా ఇష్టపడే చెల్లి మరణంతో చిన్నప్పుడే దుఃఖం జతకట్టింది. అందుకు నుంచే ఉత్తరోత్తరా తెగువ ధైర్యం, ఎగదన్ని సంచారిని చేశాయి. సంచారంలో పలువురితో సాన్నిహిత్యాలే తన స్వీయ వ్యక్తిత్వం రూపుదిద్దుకొనుటలో దోహదకారకాలయినాయి.

సంజీవ్‌దేవ్ బాల్యంలో పెరిగిన రెండు చోట్లూ గల రెండు ప్రత్యేక వాతావరణాలు తాను ఇటు సాంస్కృతిక, అటు భౌతిక విషయాలలో ఆసక్తి, పాల్గొనడం వగైరాలకు అవకాశం దక్కింది. మొదటిది తుమ్మపూడిలో, రెండోది కోనాయపాలెంలో. మొదటిదానికి అప్పటికే వారింటికి ఎక్కడెక్కడినుంచో వచ్చే పత్రికలు, ఇంటివద్దే విద్య సలిపిన ఉపాధ్యాయులు అన్ని విధాలా ప్రేరకులు. అప్పటివారి సంపన్న కుటుంబవాతావరణం వాటిపై అభిలాషను పెంచాయి. ఆ విధంగా జరిగిన బీజావహం తర్వాత్తర్వాత వృక్షమై, శాఖోపశాఖలై అక్షర, చిత్ర, స్వర (వక్త) రూపాల్లో అవని అంతా విస్తరించింది. ఆసక్తి, అభిరుచి గల రస హృదయాల సేద తీర్చింది. తీరుస్తూనే ఉంది. అవే పరిస్థితులూ, నేపథ్యం ఉన్న వారందరూ అలా రూపొందలేరు. అదే సంజీవ్‌దేవ్ ప్రత్యేకత, విశిష్టత, ఉత్కృష్టత.

క్లుప్తంగా ఆ వివరాల్లోకి వెళితే, వీధిబడి అరుగుమీద ఊరందరికీ గౌరవపాత్రులైన ఉపాధ్యాయుడు వంగర సత్యనారాయణ సంజీవ్‌దేవ్‌ని బాలుడిగా, శిష్యుడిగా గాక మిత్రునిగా చూసేవాడు. అట్లాగే యువ హిందీ పండితుడు తుమురుకోట వెంకటకృష్ణ శర్మ వీరి ఇంట ప్రత్యక్షం. అంతేగాక బంధుమిత్రుల వద్ద వున్న ఇంగ్లీషు పుస్తకాలు, పత్రికలను చదువుతూ నిఘంటువులు, వ్యాకరణాల సహకారంతో అర్థం చేసుకునేవాడు. వీటితోపాటు రవీంద్ర, శరత్‌ల పుస్తకాలు కలకత్తానుండి వారి పెదనాన్న తెప్పించేవారు. 'బింశశ్రీ', 'విచిత్ర' రెండు బెంగాలీ పత్రికలకు, 'ప్రబుద్ధభారత్' అనే హిందీ పత్రికకు 'ది మోడరన్ రివ్యూ' చందాలు చెల్లించారు. వాటిలో చిత్రకారుల కళాఖండాలు, త్రివర్ణ ప్రతిస్పేతులు, చిత్ర కళా విమర్శలు వారిని విశేషంగా ఆకర్షించేవి. స్వామి సత్యదేవ్

రచించిన హిందీ పుస్తకం 'మేరీ కైలాస్ యాత్ర' తెప్పించాడు అందులో హిమాలయాల సౌందర్యాన్ని మళ్లీ మళ్లీ చదివాడు. రామకృష్ణ మిషన్ వారి 'ప్రబుద్ధభారత్' (ఆంగ్ల మాస పత్రిక) శ్రద్ధగా చదువుతుండేవాడు. ఇలాంటివన్నీ పురికొల్పిన జిజ్ఞాస పునాదితో అనంతర పర్యటనలు, ప్రసంగాలు, రచనలు, చిత్ర, కళా, కవితల్లాంటి విశ్లేషణాంశాలనేకం 'తనకు తానే గురువైన' రీతిలో కడవరకూ కొనసాగాయి.

*ఇంతటి మహోన్నత వ్యక్తిలోని హాస్య ప్రవృత్తి మరో ప్రత్యేక కోణం. ఇది వారి రచనల్లో అక్కడక్కడా గుప్తంగా ఉన్నా ప్రత్యక్షంలో ఎంతగానో వుంటుందనేది సన్నిహితులకు బాగా తెల్సిందే. అదేదో పనిగట్టుకుని తెచ్చిపెట్టుకున్నది గాక చాలా సహజంగా అన్పిస్తుంది.*

అందువల్లనే ఎలాంటి అంచనాలకు అందనిది వారి వ్యక్తిత్వం. ఎటువంటి ప్రమాణాలకు లొంగనిది వారి మూర్తిమత్వం. ఏ చట్రంలో ఇమడనిది వారి పరిణతి. అత్యంత సహజాతి సహజంగా, సరళంగా, స్వేచ్ఛగా, నిర్మలంగా, మధురంగా, మనోహరంగా, మహోన్నతంగా జీవన శిల్పాన్ని రాగరంజితంగా, రసభరితంగా మలచుకున్న నేర్పరి. తీర్పులివ్వని తీర్పరి. ఎందరెందరినో చప్పుడు లేకుండా ప్రభావితం చేసిన, చేస్తున్న గడుసరి. వారితో ఎవరికి ఏ రూపంలో, ఏమోతాదులో పరిచయం వున్నా తమని తాము ప్రత్యేకంగా భావించుకునేంతగా ప్రభావితం గావించిన చెరగని చెరపలేని ముద్ర వారిది.

ఇందుకు ప్రాతిపదికలనేకం ఉన్నాయి. వీరి రచనల్లో, ప్రసంగాల్లో, సర్వత్రా భావ స్పష్టత, వ్యక్తీకరణ స్పష్టత చదువరిని లేక శ్రోతని వారితో మమేకం గావిస్తుంది. వారిని తనకూడా తోడ్కొని పోతుంది. విహరింపజేస్తుంది. వికాసవంతుడిని చేస్తుంది. ఆ వికాసంలో వారూ పరిమళ భరితులై పుష్పిస్తారు, ఫలిస్తారు. వారితో కల్సి జీవన రాగం ఆలాపిస్తారు. ఎక్కడా ఒక అధ్యాపకుడు, బోధకుడు కన్పించరు. అంతటా ఒక ఆత్మీయునిగానే గోచరిస్తారు. ఎంతటి సంక్లిష్ట విషయమైనా సరే వారి విపులీకరణలో 'ఇంతేనా' అన్పిస్తుంది. అరటి పండు వలిచి పెట్టినట్లు అంటే ఇదేనేమో అన్పిస్తుంది. అతని ప్రసంగం తీరు అనితరసాధ్యం.

సంజీవదేవ్ తన రచనల్లో ఎందరెందరో విశిష్ట వ్యక్తుల గురించి రాశారు. ఆయా సందర్భాలలో ప్రస్తావించారు. నిజానికి ఆయా ప్రముఖుల్లోని ఆయా ప్రత్యేకాంశాల్లో కొన్ని కొన్ని వారిలోనూ నిబిడీకృతమై వున్నాయి. తానో అదృశ్య అయస్కాంతం కాబట్టే ఆవలి వారి ఖనిజాకృతుల్ని ఆకర్షించి అక్షరీకరించారు. అందువల్లనే వారు బహుముఖీన. ఒక పరిపూర్ణ మానవునిలో ఎన్నెన్ని పార్శ్వాలుంటాయో అన్నీన్నీ వారిలో ఉండడం అరుదైన అంశం. అపురూపమైన విశేషం. అన్నింటా ఎక్కడా పరస్పరం సంఘర్షణ ఈషణ్మాత్రం తొంగిచూడకపోవడం వారి వ్యక్తిత్వ ఔన్నత్యానికి ప్రతీక. పరిపూర్ణ జీవన వికాసానికి సూచిక. అధ్యయనంతో, అవగాహనతో ఆచరించదలచిన వారికి కరదీపికలవన్నీ.

ఆవలివారిలో తాను ఏకీభవించని అంశాల్ని ప్రస్తావించడానికి సంశయింపరు. వారు ఎంతటి వారైనా. అది రాహుల్ సాంకృత్యాయన్ హేతువాద పరిమితుల సంబంధించైనా, రామస్వామి చౌదరి వ్యక్తిత్వ వివాహాది విషయాల్లోనైనా అట్లాగే మతాలకు, పూజాదికాలకు సంబంధించీ తన అభిప్రాయాల్ని కరాఖండీగా చెప్తుండేవారు. అయితే వీటి కారణంగా ఆవలివారిలో విశేషాంశాల్ని ఏమాత్రం తగ్గనీయకపోవడం వారి పరిణతికి నిదర్శనం. "వోల్టేర్" మాటల్లా అవి అందరికీ ఆదర్శనీయం. అందువల్లనే వీరి ఆయా రంగాలకు సంబంధించిన విపులీకరణలు, విశ్లేషణలూ అత్యంతాధునికాలూ, సాంస్కృతిక శిఖరాలు, రసావిష్కరణలు. కాబట్టే సార్వజనీనాలు, సార్వకాలీనాలు, సర్వామోదితాలు, నిత్యనూతనాలు.

ఇంతటి మహోన్నత వ్యక్తిలోని హాస్య ప్రవృత్తి మరో ప్రత్యేక కోణం. ఇది వారి రచనల్లో అక్కడక్కడా గుప్తంగా ఉన్నా ప్రత్యక్షంలో ఎంతగానో వుంటుందనేది సన్నిహితులకు బాగా తెల్సిందే. అదేదో పనిగట్టుకుని తెచ్చిపెట్టుకున్నది గాక చాలా సహజంగా అన్పిస్తుంది. ఒక ప్రసంగానికి ముందు తనను పరిచయం చేస్తానన్న తనతో "వూరికే పొగడబాకు" అన్నారు. పరిచయం అంటే పొగడ్తలుగా స్థిరపడినట్లు గ్రహించడం అన్నమాట. తన పూజకు ఏ చోటయినా ఫరవాలేదంటారు. 'పరమాత్ముడు అన్నింటా వుంటాడు కదా!' అని తనకు సగం ప్రచారం చేసిపెట్టింది బాలబంధు బి.వి.నరసింహారావు అంటారు. తనేమీ ఎరగనట్లు. పీఠికలు రాయకూడదని నిర్ణయించుకున్నారట. పరిచయం రాయకున్నా అపరిచయ వాక్యలేమైనా రాయమంటున్నారంటారు. రెండో దానికన్నా మొదటిదే ఉత్తమమని కొనసాగిస్తున్నా' అంటారు. ఆయా వ్యక్తులకి పరిమితమైన ఇలాంటివి మరింతగా

వెలుగులోకి రాగలిగితే అవి ఎందరినో అలరిస్తాయి. పైగా వారిలోని మరో పార్శ్వమూ ఆవిష్కృతమవుతుంది.

సంజీవదేవ్‌ని కొందరు అభిమానంతో 'ఆంధ్రాఠాగూర్'గా అభివర్ణిస్తుంటారు. సంపన్న కుటుంబంలో జన్మించడం, తాము అనుకున్న రీతిలో జీవించగలగడం, ఆయా సందర్భాల్లో విషాదాన్ని ఎదుర్కోవడం, విస్తృతంగా రాయడం, ఆలశ్యంగా చిత్రకళ ప్రారంభించడం లాంటి వాటిల్లో సారూప్యం కాదనలేము. కాని సృజన విషయంలో, అభివ్యక్తుల తీరు తెన్నుల్లో ఎవరి దారి వారిదే. ముఖ్యంగా మార్మికతకు టాగూర్ మారుపేరు. సంజీవ్‌దేవ్‌లో అది అంతగా కాదు. అసలు కన్పించదు. ఆ పేరుతో పలు సందిగ్ధాల్లో తచ్చాట్లాడడం మచ్చుకి కూడా ఉండవు. అయితే బెంగాలీ సాహిత్యంతో, కళ సృజనకారులతో అత్యంత సాన్నిహిత్యం తొలినుండీ ఉండడం వలన కళాదృష్టి, అనుశీలన, విశ్లేషణాదులు ఏకీకృతాలన్పించవచ్చు. అట్లాగే టాగోర్ కొన్ని సందర్భాల్లో గాంధీతోనూ సామాజికాంశాల్లో విభేదించారు. సంజీవ్‌దేవ్ అలాంటి పని ఎక్కడా, ఎప్పుడూ, ఎవరి విషయంలో చేసినట్లు కన్పించదు. ఎలాంటి పోలికలకీ, ప్రమాణాలకీ, కొలతలకీ అందనంత విశిష్ట వ్యక్తిత్వం సంజీవ్‌దేవ్‌ది. సమస్త చట్రాలకతీతమైనది. తనకు తానే సాటి. మానవ విశ్వ ప్రేమికుడు.

రవీంద్రుడు విశ్వకవి. సంజీవ్‌దేవ్ విశ్వమానవుడు. రెండూ విశిష్టాలే. రెండోది మరింతగా. మొదటి దానికి భావుకత అవసరం. రెండోది కావడానికి చాలా చాలా అవసరం. అందునా ఆచరణశీలుడు కాదగినపుడు మరింతగా ఒక కవిగా రవీంద్రుని ప్రాధాన్యతలు ప్రాకృతిక, మార్మిక, హృదైక ప్రపంచానికి చెందినవి. సంజీవ్‌దేవ్‌లో మేధస్సు మెండు. కళతో పాటు శాస్త్రానికి, దానికి ప్రాతిపదిక అయిన హేతువు. అవి అనుసందించబడిన మనిషికీ ప్రాధాన్యం హెచ్చు. కళాజగత్తులో జీవించేవారికి ఈ దృష్టి స్పష్టత, అభివ్యక్తి స్పష్టతకు బాట వేస్తుందనటానికి అరుదైన సంజీవ్‌దేవ్ రచనలన్నీ సాక్ష్యాలే. అవే సంజీవ్‌దేవ్‌ని అరుదైన ప్రత్యేక వ్యక్తిగా సృజనకారునిగా ఎల్లకాలం నిలుపుతాయి.

ఆయా సందర్భాల్లో వెల్లడించిన మాటల్లోనే వారేమిటో తెలియవస్తుంది. "చిత్రకారునిగా నేను ప్రఖ్యాతి చెందలేదు. చెందాలనే అభిలాషా లేదు. మరి ఏమిగా ప్రఖ్యాతి చెందాలని

> *"చిత్రకారునిగా నేను ప్రఖ్యాతి చెందలేదు. చెందాలనే అభిలాషా లేదు. మరి ఏమిగా ప్రఖ్యాతి చెందాలని ఉన్నదంటే మంచి మానవునిగా ప్రఖ్యాతి చెందాలని ఉన్నది" అంటారు. అలాగే "మరణ పర్యంతం శాంతితో ఆనందంతో నేను జీవిస్తూ ఇతర్లను జీవింపచేయటం నా జీవిత లక్ష్యం" అంటారు.*

ఉన్నదంటే మంచి మానవునిగా ప్రఖ్యాతి చెందాలని ఉన్నది" అంటారు. అలాగే "మరణ పర్యంతం శాంతితో ఆనందంతో నేను జీవిస్తూ ఇతర్లను జీవింపచేయటం నా జీవిత లక్ష్యం" అంటారు. ఇవి వారి వ్యక్తిత్వాన్ని పట్టిస్తాయి. 'ఊటీలో సంధ్య' అనే వారి చిన్న వ్యాసం ముగింపులో "ప్రకృతి ఇంత ఆనందమయంగా ఉంది. కాని మానవునిలో ఏది ఆ ఆనందం? దైన్యం, దారిద్ర్యం, వ్యధలూ, బాధలూ, ఆకలీ, దప్పికా, రోగాలూ, మరణాలూ.." అంటూ స్పందిస్తారు. సునిశితంగా మనిషి ఎదగవలసిన స్థాయిని సూచిస్తూ దుఃఖానికి లొంగక స్పందిస్తారు. "మనిషికి సాధ్యం కానిది లేదని తెల్పుతూ భావోద్వేగాలలో మరో కీలకాంశం భయం గురించి 'ఒకరు ఏమైనా కావచ్చు కాని నిర్భయుడు కాకపోతే మాత్రం జీవితంలో విషాదఛాయలు వదలవు". ఎన్నెన్ని ఉదాత్త లక్షణాలున్నా వాటన్నింటినీ ఈ ఒకటే పారద్రోలగలదు. అట్లాగే నేనెవరంటే నా స్వరూపమూ, నా స్వభావమూ రెండూ అని సమన్వయిస్తారు. ఎక్కడా ఎటువంటి తటపటాయింపుల్లేకుండా వారి సృజన, వ్యక్తిత్వమూ పరస్పరం ఉన్నతీకరించాయి. ఉదాత్తకరించాయి. అవి ప్రస్తుత తరాలకే కాదు. రాబోయే తరాలకీ అనుసరణీయాలు, ఆచరణీయాలు, మార్గదర్శకాలు.

ఇంతటి మహోన్నత వ్యక్తి జన్మించి కడవరకూ జీవించిన ప్రాంతం నేటి మన నూతన రాజధానిలో అంతర్భాగంగా ఉంది. ఆ తుమ్మపూడి గ్రామం తెనాలికి 15 కి.మీ., విజయవాడకు 20 కి.మీ., మంగళగిరికి 10 కి.మీ., గుంటూరుకు 30 కి.మీ. దూరంలో ఉంది. కావున ఆ గ్రామంలో వారింటిని ఒక సాంస్కృతిక పునరుజ్జీవన కేంద్రంగా ఏర్పరచాలి. అందులో వారి చిత్రాలు, రచనలతో శాశ్వత మ్యూజియం ఏర్పరచాలి. అది అందరికీ అందుబాటులో అధ్యయన కేంద్రంగా వుంచాలి. అది మరో సాంస్కృతిక పునరుజ్జీవన కేంద్రంగా విలసిల్లాలి. వారి సాంస్కృతిక వారసులతో పాటు ప్రభుత్వం, కుటుంబ సభ్యులు జిజ్ఞాసాపరులు ఇందుకు తమవంతు సహాయ సహకార సంపత్తులు అన్ని రూపాల్లో అందించాలి. మన సాంస్కృతిక వారసత్వం నిలబెట్టుకోవడం, కాపాడుకోవడం, వృద్ధి చేయడంలో మన పురోగతి ఆధారపడి వుంటుంది. లేకుంటే నానాటికి ఉధృతమవుతున్న ధన, అరాచక విష సంస్కృతికి హద్దులుండవు. ప్రత్యామ్నాయలుండవు. పరిపూర్ణం కాకున్నా సాంస్కృతిక జీవనమే మనిషిని మిగతా ప్రాంతాల్నుండి విడదీసేదని విస్మరించరాదు. ❋

# పెద్దింటి అశోక్‌కుమార్ కథలు- స్త్రీ పాత్ర చిత్రణ




- కె. నరసింహుడు
8978248551

ఆయన కథల్లో పాత్రలన్నీ దాదాపు గ్రామీణ పాత్రలే. కథల్లో తాను చెప్పదలచుకున్న విధంగా పాత్రలను మలచుకుంటాడు. ఇతివృత్తానికి ప్రాణం పోసేవి పాత్రలు. తన చుట్టూ కనబడుతున్న జీవితంలోని భావుకతను సుందరంగా, ప్రతిభావంతంగా జీవచైతన్యం ఉట్టిపడేటట్లు పాత్రలను సృష్టించుకోగల రచయిత అశోక్‌కుమార్.

సమాజానికి మార్గదర్శకంగా నిలిచే పాత్రల్ని ఆదర్శపాత్రలంటారు. రచయితలు తమలోని ఉన్నత భావాల కనుగుణంగా పాత్రల్ని సృష్టిస్తారు.

పెద్దింటి అశోక్‌కుమార్ తన కథల్లో పాత్రలకు చాలా ప్రాముఖ్యాన్నిచ్చాడు. కొన్ని పాత్రలు పాఠకుడి మనస్సులో స్థిరంగా నిలబడి ఆలోచింపజేస్తాయి. ఆయన కథల్లో పాత్రలన్నీ దాదాపు గ్రామీణ పాత్రలే. కథల్లో తాను చెప్పదలచుకున్న విధంగా పాత్రలను మలచుకుంటాడు. ఇతివృత్తానికి ప్రాణం పోసేవి పాత్రలు. తన చుట్టూ కనబడుతున్న జీవితంలోని భావుకతను సుందరంగా, ప్రతిభావంతంగా జీవచైతన్యం ఉట్టిపడేటట్లు పాత్రలను సృష్టించుకోగల రచయిత అశోక్‌కుమార్.

సమాజానికి మార్గదర్శకంగా నిలిచే పాత్రల్ని ఆదర్శపాత్రలంటారు. రచయితలు తమలోని ఉన్నత భావాల కనుగుణంగా పాత్రల్ని సృష్టిస్తారు.

'దగా' కథలో ప్రధాన స్త్రీ పాత్ర శ్రీలత. ఆదర్శపాత్ర. ఇతర దేశాల్లోని బ్రోకర్ల చేతిలో మోసపోయిన తన భర్తకు స్థానికుల దగ్గర ఎలాంటి చెడ్డపేరు రానివ్వకుండా ఆమె చూపిన సంస్కారం అపూర్వమైంది.

సత్యం, గల్ఫ్‌దేశాలకు వెళ్లాలనుకునేవాళ్లకు వీసాలు ఇప్పించే బ్రోకర్. అతని భార్య శ్రీలత. ఆమెకు భర్త ఈ వృత్తిలో ఉండడం ఇష్టంలేదు. అందుకే సందర్భం వచ్చినప్పుడల్లా ఆ వృత్తిని మానేయమని భర్తను శతవిధాలకోరేది. కానీ సత్యం ఇంత డబ్బు వేరే వృత్తిలో రాదని అనేవాడు.

"తృప్తిలేని డబ్బు ఎందుకు చెప్పండి. నలుగురు నాలుగు రకాలుగా అంటున్నారు. ఒకరిని పీడించి తీసుకున్న డబ్బు ఎన్నాళ్లుంటుంది చెప్పండి? మన కష్టం మనం చేసుకొని రెండు పూటలు తిన్నాసరే! అందులో తృప్తి ఉంటుంది. మీ మాటల్ని నమ్మి రెండు సంవత్సరాల్లో లక్షాధికారులమై పోతామనుకుని పుస్తె, మట్టెల్ని అమ్మడానికి కూడా వెనకాడకుండా డబ్బుల్ని మన చేతుల్లో పోస్తున్నారు. ఒకరి ఉసురు మనకెందుకు చెప్పండి' అని భర్తకు నచ్చచెప్పడానికి ప్రయత్నించేది. కానీ సత్యం ఈ వృత్తే విలాస జీవితానికి సరైనదని చెప్పేవాడు. కానీ బొంబాయి బ్రోకర్లు సత్యాన్ని మోసం చేసి డబ్బుతోసహా ఉడాయించారు. ఇది అర్థం చేసుకోక ఊర్లో వాళ్లు సత్యాన్ని శాపనార్థాలు పెట్టారు. సత్యం పరారీ లో ఉన్నాడు. శ్రీలత ఆలోచించి తన తండ్రితో ....

"నాన్నా...వారు కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే నేను చూడలేను. ఇండ్లు, పొలాలు అమ్ముకుని అతనిని నమ్మి

డబ్బులు ఇచ్చారు. నేనూ చేతులెత్తేసి ఊర్కుంటే నన్నేవరూ ఏమీ చేయలేరు కానీ, ఒక ఆడదానిగా సాటి ఆడవాళ్ళు ఆవేదనని అర్థం చేసుకొని చెబుతున్నాను. నా నగలు ఇంట్లో సామాన్లు, పొలం, ఇల్లు అన్నీ అమ్మేసెయ్. ఎవరి డబ్బులు వారికి ఇచ్చెయ్. జీతం తక్కువుందని వ్రాసారు కదా వారు, వారికి సగం డబ్బు ఇచ్చెయ్ నేను కష్టం చేసుకుని నాపిల్లల్ని పోషించుకుంటారు. ఈ అప్పు తీర్చేస్తేనైనా నిర్భయంగా అతడు ఊరిలో అడుగుపెడతాడు." అని అంటుంది.

సర్వం కోల్పోతున్నా, కూతురు మొహంలోని ఆత్మవిశ్వాసాన్ని చూసి ధైర్యంగా ముందుకు కదిలారు. ఆమె తండ్రి.

మనిషిలో ఇంకా మానవత్వ విలువలు కొనసాగుతున్నాయనే విశ్వాసాన్ని కల్గించే పాత్ర 'శ్రీలత'.

మూయిముంత కథలో ప్రధాన స్త్రీ మూర్తి సాయమ్మ. మాతృమూర్తి అన్న పదానికి మూర్తిభవించిన ప్రతీక సాయమ్మ.

సాయమ్మకు ముగ్గురు కూతుళ్ళు. ఇద్దరు కూతుళ్లను వేరే ఊర్లకిచ్చి పెళ్లి చేసింది. చిన్న కూతురు దేవను ఉన్న ఊర్లోనే మేనరికం ఇచ్చి చేసింది. దేవ ఊర్లోనే ఉంది కాబట్టి తల్లిగారింటికి పొద్దున వస్తే సాయంత్రానికి వెళ్లిపోయేది. ఇద్దరు కూతుళ్ళు మాత్రం వారాల తరబడి ఉండేవాళ్లు. తల్లిగారి సంపాదనంతా అక్కలే తింటున్నారని దేవ అనుమానం. ఊర్లో ఉంటుంది కదా దేవకే పెడుతుందని అక్కల అపోహ. దీంతో వారి మధ్య గొడవలు వచ్చాయి.

దేవ గర్భవతైందని తెలిసి సాయమ్మ హృదయం తల్లడిల్లిపోయింది. ఈలోపు దేవకిచ్చిన బర్రె కట్టింది. సరిగ్గా ఈనే సమయానికి సాయమ్మ పొలంలోకి వచ్చిపడింది. ఇది గమనించి సాయమ్మ బర్రెను కళ్లల్లో ఒత్తులేసి గమనించడం ఆమె భర్తకు నచ్చలేదు. సాయమ్మ భర్తను ఈసడింపుగా చూసింది. బర్రె ఆయాసంతో కాళ్ళను రాస్తుంది. నీరసంగా కూలబడి లేస్తుంది. తలపైకి ఎత్తి అరుస్తుంది. పోటు మీదున్న సముద్రం లాగా కల్లోలంగా కదులుతుంది. మంత్రించినట్లు సాయమ్మ బర్రె చుట్టూ తిరుగుతుంది. ఆయాసంతో ఉన్న బర్రెను పశువులా కాక కడుపుతో ఉన్న తన బిడ్డలా చూసుకుంది. ఈనే సమయం దగ్గర పడేకొద్దీ సాయమ్మలో ఆందోళన ఎక్కువైంది. ఇంతలో బర్రెకు సుఖ ప్రసవమైంది.

*తన కన్న కూతురు తనను కాదని వెళ్లిపోయినా, మాతృ హృదయం భావనతో ఆ పిల్లల్ని ఈసడించుకోని కన్న పేగు సాయమ్మది.*

తొలుసూరి కానుపు పొదుగు నిండుగా ఉన్నా మొనల్లో దార సాగలేదు. తడిచేసి సన్నుల్ని సాగదీసింది సాయమ్మ. ముర్రుపాలు తాగితేనే దూడ బతుకుతుంది. ముర్రుపాలు ఎంత తాగితే అంత గట్టిపడుతుంది దూడ. సన్నును సాగదీసి చంటి దూడ నోటికి అందించింది. దూడ వెతుకులాడుతుంది. మూతితో ఎక్కడెక్కడో తడుముతుంది. నిలబడలేక కూలబడుతుంది. రొమ్మును అందుకోలేక పోతుంది. కొంతసేపు మాయిని, భయాన్ని మరిచిపోయింది సాయమ్మ. దూడను ఎత్తి తన గుండెను అదిమి పట్టుకుంది. దాని మూతిని సాగదీసి రొమ్మును నోట్లో పిండింది. దూడ ఆరాటాన్ని సాయమ్మ ఆలోచనను అర్థం చేసుకున్నట్టుగా బర్రె వెనుక కాళ్లను దూరంగా జరిపింది. పొదుగును దూడకు అందేటట్టు పంగటిచ్చి వంగి నిలబడింది.

బర్రె బాలెంత. ఎంత పశువైనా ఒళ్ళు పచ్చిపుండు అవుతుంది. దూడ నోట్లోకి ముర్రుపాలు పిండుతుంటే రొమ్ములు పగిలినాయి. రక్తం కారుతుంది. పాలను రక్తాన్ని చూడగానే తన పెద్దబిడ్డ పుట్టినప్పటి సంగతి గుర్తుకొచ్చింది సాయమ్మకు. అప్పుడు పాలు పడ్డాయిగానీ సన్ను ముక్కుకు రంధ్రాలు పడలేదు. మంచం నులుక సందుల్లోంచి పాలను పిండింది. రొమ్ములు పగిలి రక్తం కారింది. ఆ బాధ ఇప్పుడు గుర్తుకొచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆ దూడకు సాయమ్మ చేస్తున్న చాకిరీ చూసి సాయన్న చిర్రెత్తి పోయాడు. అయినా సాయమ్మ బర్రెను, దూడను చక్కగా కాపాడి అల్లుడికప్పగించింది. ఏదో గొణుగుతున్న భర్తతో "తల్లి లక్క బిడ్డ రాయంటరు. నిజమే బర్రె జూసినావా...దుడ్డె ఎంట పడిపోతుంది. రెండు మూడు నెల్లాయే. దేవ మొఖం జూడక. బిడ్డ బరువు మనిషి. ఎట్లుండెనో.... పొద్దులు నిండినంక తోలుక రావాలె. అత్తముండదేంపోతుంది. ఆపది వడేదాక పని జెప్పతనే ఉంటుంది" అటుంది సాయమ్మ.

తన కన్న కూతురు తనను కాదని వెళ్లిపోయినా, మాతృహృదయం భావనతో ఆ పిల్లల్ని ఈసడించుకోని కన్నపేగు సాయమ్మది.

అత్తగారింట్లో తన కూతురు నిండు గర్భిణి అనే

స్పృహతో ఇక్కడ బర్రెకు పురుడు పోసిన కారుణ్యమూర్తి సాయమ్మ. కుటుంబ సంబంధాలు, మానవసంబంధాలు దరిదాపులో మృగ్యమైపోతున్న తరుణంలో ఈమె పాత్ర కథా సాహిత్యంలో సజీవ స్త్రీ మూర్తి పాత్ర అని చెప్పుకోవచ్చు.

*"ఎజెండా" కథలో ప్రధాన స్త్రీ పాత్ర శిల్ప. మతాన్ని అడ్డుపెట్టుకొని, ఎదగాలనుకునే స్వార్థపరుడైన భర్తను ఎదిరించి పరమత సహనాన్ని చాటిన ఆదర్శ మహిళ శిల్ప.*

"ఎజెండా" కథలో ప్రధాన స్త్రీ పాత్ర శిల్ప. మతాన్ని అడ్డుపెట్టుకొని, ఎదగాలనుకునే స్వార్థపరుడైన భర్తను ఎదిరించి పరమత సహనాన్ని చాటిన ఆదర్శ మహిళ శిల్ప.

శిల్ప స్కూల్లో టీచరుగా పనిచేస్తుంటుంది. అందరితో స్నేహంగా ఉంటుంది. శిల్ప భర్త దామోదరం వ్యాపారి. రాజకీయాల్లో చురుకుగా పాల్గొంటుంటాడు. దానిలో భాగంగానే అతని చికెన్ షాపులో మదదార్ చికెన్ అమ్మబడును అని బోర్డు పెట్టిస్తాడు. ఈ విషయం శిల్ప సహాధ్యాయి కరీం చెప్పగా చాలా బాధపడుతుంది. శిల్ప, దామోదర్ విజాతి ధృవాలు. శిల్ప తన చిన్ననాటి స్నేహితురాలి నుండి వచ్చిన ఉత్తరం చదువుకొని గతంలోకి వెళ్లిపోతుంది. తన చిన్నప్పుడు పీర్లపండుగ, రంజాన్ ఎలా జరుపుకునే వారో గుర్తుకొస్తుంది. ఫాతిమా పెళ్లయిన తరువాత కలుసుకోవడం తగ్గిపోయిన, శిల్ప పీర్లపండుగకు వెళ్లి ఈసారైనా ఫాతిమాను కలవాలనుకొంటుంది. ఆ రోజు స్కూల్ నుండి ఇంటికి వచ్చిన శిల్పకు ఇంట్లో చాలామంది ఉండడం గమనించి అత్తను అడిగితే ఎవరో రాజకీయాలకు సంబంధించిన వాళ్ళంటుంది. వాళ్ళకు అతిథి మర్యాదచేస్తూనే వాళ్ల సంభాషణ వింటుంది. వాళ్లు ప్రజల్లో మతవిద్వేషాన్ని రగిలించాలని చూస్తారు.

పీర్ల పండుగలో హిందువులను పాల్గొనకుండా చేయాలని అనుకుంటారు. దానిలో భాగంగానే కోటినోములు వ్రతం చేయాలని శిల్పదంపతులు దీక్షబూనాలని దామోదరం చెబుతాడు. శిల్ప ఆ మాటకు వెంటనే స్పందిస్తూ "చూడండి సగటు మనిషి ఎప్పుడూ మతాన్ని కోరుకోడు. విధ్వంసాన్ని ఆహ్వానించడు. కూడు, గూడు, ప్రశాంత జీవనం, వీటికొరకు మీరేదైనా చెయ్యగలరేమో ఆలోచించండి అని నిలదీస్తుంది" మరుసటి రోజు ఎవరు వారిస్తున్నా వినకుండా బస్సు ఎక్కి ఊరికెళుతుంది శిల్ప.

మనుషుల మధ్య ద్వేషాన్ని పెంచే మతమౌఢ్యం కన్నా మానవత్వం, పరమత సహనం గొప్పదని చాటే ఆదర్శపాత్ర శిల్ప.

గీతాంజలి రాసిన "ఊరికి పోదాం భూదేవి" కథలో స్త్రీ నిరంతరం పేదధనిక బేధం లేకుండా ఎలా దోచుకోబడుతుందో నేటి ఈ ప్రపంచం కుగ్రామంలో మారిన నేపథ్యంలో కూడా కూలి పనిచేసే వాడి పెళ్లాంకాని, ఉద్యోగం చేసే భర్తకాని, డబ్బు తెచ్చే బానిసలుగా ఉండాల్సిందేనా అంటూ, ఇంట్లో చాకిరికి అదనంగా బయలు చాకిరీ చేసి డబ్బు సంపాదించి భర్త దోసిట్లో పోయడం అన్న విషయాన్ని ఈ కథలో చూపుతుంది. ఇల్లు, స్కూటర్, టీవి, ఫ్రిజ్, సెల్‌ఫోన్‌లను కొనుక్కొని సౌఖ్యాలను పెంచుకొందామన్న భ్రమతో భర్తను సంపాదించమని ఒత్తిడికి గురిచేయడమనే దుర్మార్గాన్ని ఈ కథలో చూడవచ్చు. విపరీతమైన ఒత్తిడిపాలైన ఆ స్త్రీ కలలోనైనా భర్తపై తిరుగుబాటు చేసి మనశ్శాంతి పొందుతుంది. వస్తు ప్రపంచ భ్రమలకు లోనైన నేటితరం భర్తలు ఆమె ఇష్టాఇష్టాలను కాని, ఆమె శ్రమను కాని గుర్తించక బానిసలా పీడించే వారి లాగా కనిపిస్తారు. ఈ విషయాన్ని రెండు కోణాల్లో నిరంతరం శ్రమ దోపిడి, ధనదాహాల మధ్య స్త్రీ పడుతున్న వేదన గురించి ఒకవైపు పనిమనిషి యల్లమ్మ ఇంకోవైపు ఉద్యోగిని శివాని పడే సంక్షోభాన్ని చూపుతుంది.

నేటి స్త్రీ భర్తతోపాటు సమానమైన చదువు చదివి ఒకే వృత్తి చేస్తున్న స్వతంత్రత లేదని ఒకవేళ స్వతంత్రత ఉన్నా భార్య అతని మీద ఆధారపడకుండా బజారుకు వెళ్లి వస్తువులు తెచ్చుకొని ఇంటి పని చేసుకొనే వారై ఉండాలని అలా అని స్వతంత్రతంగా ఆలోచించకూడదు. తనకంటే కొంచెం చిన్న ఉద్యోగం చేస్తూ ఇల్లు గడవడానికి అతని మీద ఆధారపడుతూ అణిగిమణిగి ఉండాలంటూ అదే భర్తకు మాత్రం ఎన్నో మినహాయింపులిస్తూ పనిలో వ్యవహారంలో ఇంటి పనుల్లో భారమంతా భార్యపై వదలి తప్పించుకొనే ఒకానొక భర్త నిర్వాకాన్ని అసహ్యించుకుంటూ విడాకుల కోరిన స్త్రీ కథ కవన శర్మ "విడాకులు" కథ. అమెరికాలో ఉద్యోగం చేస్తున్న పిల్లలకోసం ఊర్లో ఉన్న భర్తను కాదనుకోనేంతగా ఒక తల్లి బిడ్డ గురించి ఆలోచించి అమెరికా వెళ్లి అక్కడ వెట్టిచాకిరీ చేయడం చివరకు అందరూ తనను తమ అవసరాలకు వాడుకొనే యంత్రంగా భావించారని గ్రహించి తిరిగి ఇంటికొచ్చి భర్తను పోగొట్టుకొని ఒంటరిగా మిగిలిపోయిన స్త్రీ వ్యధను తెలియజేస్తుంది నల్లూరి రుక్మిణి వ్రాసిన "పోగుతెగిన అల్లిక" కథ.

# సప్తతి

- కడియాల రామమోహనరాయ్
9959778698



మనుషులు మాట్లాడతారు
జంతువులు శబ్దిస్తాయి
"సెవెంటి క్రాస్ చేశారా? " పోరంకి ప్రశ్న
"నో! నాకింకా అరవై తొమ్మిదేళ్ళే!"
"డెబ్బై నిండాయా మీకు" అవసరాల అనవసర కుతూహలం
"ఇంకా నయం నూరేళ్లు నిండాయా?
అన్నట్టు ఏమిటా తొందర
నా కింకా అరవై తొమ్మిదేళ్ళే!"
"ఏమిటైతే! బి.పి. సుగర్ హైపర్‌టెన్షన్!"
"లేవు బాబూ లేవు - డోంట్ విష్!
ఏళ్లు రాగానే సరా?
ఏండ్లు మీఱిన వాడా వృద్ధుడు?
తామరాకు మీద నీటి బొట్టులా తళతళా మెరవాలి
కీళ్ల నొప్పులు, దగ్గూ ఆయాసం
ఆకలి లేదు, నిద్రపట్టడం లేదు
అంటూ ఎవర్నీ విసిగించొద్దు
"వాకింగ్' 'జాగింగ్' అంటూ ప్రాణం తీయొద్దు
'దేశం ఏమయ్యేట్టు' అని ఒకటే నస పెట్టొద్దు
సోక్రటీస్ ఫేస్ పెట్టొద్దు
టీవిలో, పేపర్లో వార్తలు చెప్పి నీరసం తెప్పించొద్దు
ఇంట్లో ఎవరూ నా మాటవినటం లేదంటూ
దిగులు రోగం అంటించొద్దు
"లాఫింగ్ క్లబ్‌లో చేరి చెత్తజోకులు చెప్పి
కడుపులో దేవేట్టు చెయ్యొద్దు
"వార్ధక్యానికి సార్థక్యం' పుచ్చా పూర్ణానందం గారిని
అడిగి తెలుసుకో
నీ అవయవాలు ఎవరికైనా ఎందుకైనా
పనికొస్తాయేమో తెలుసుకో
చిరునవ్వు చెదిరిపోకుండ కళ్లల్లో వెలిగించు

పోరంకి - పోరంకి దక్షిణామూర్తి
అవసరాల - అవసరాల రామకృష్ణారావు

❋

---

సంఘటనల కాణాచియైన జీవితంలో నుంచి కథావస్తువు గ్రహించి, తన ఉద్దేశాలకనుగుణంగా పాత్రలను ఎన్నుకొని చిత్రిస్తాడు కథకుడు. అందుకే కథానికా ప్రక్రియలో పాత్ర చిత్రణకున్న ప్రాముఖ్యం సాటిలేనిది. ఈ విషయాన్ని గుర్తెరిగిన పెద్దింటి అశోక్‌కుమార్ తనకథల్లో సజీవమైన చిత్రాలుగా పాత్రల్ని సృష్టించాడు.

సృష్టిలో సర్వోత్కృష్టమైన ప్రాణి మానవుడు. అతడి జీవితం కన్నా విశిష్టమైనది ప్రపంచంలో మరొకటి లేదు. జీవితమంటే సుఖదు:ఖాలు. ఒక మనిషి జీవితంలో అవి ఎలా సంప్రాప్తిస్తాయి. ఆయా సందర్భాల్లో మనిషి ఎలా ప్రవర్తిస్తున్నాడు? జీవితంలోని ప్రేరణలు, వాటికి మానవుడు పొందే స్పందనలు - ఈనాటి కథానికకు వస్తువులు. జీవితాన్ని కథగా మలిచే విశిష్ట సాహిత్య ప్రక్రియ అయిన కథానికలో ఆ వ్యక్తి యొక్క వైశిష్ట్యాన్ని నిరూపించడమన్నదే పాత్ర చిత్రణలో చేయవలసిన పని.

స్థూలంగా శరీర నిర్మాణాన్ని బట్టి చూస్తే మానవులందరూ ఒక్కటే. కానీ స్పష్టాస్పష్ట విభేదాల వల్ల ప్రతి మానవుడి ఆకారంలోనూ ప్రత్యేకత ఉంది. ఆ ప్రత్యేకతలను ఆకళింపుచేసుకొని కథకుడు కథ రాస్తాడు. ఆ సందర్భంలో తాను ఉద్దేశించిన ఉద్దేశ్యాల కనుగుణంగా తన కథలో పాత్రలను మలచడమే పాత్ర చిత్రణ అనవచ్చు.

జీవితంలోని సుఖదు:ఖాలకు మనిషి కొంత వరకే బాధ్యుడు. మిగతా కొంతకు అతనుంటున్న పరిసరాలు, వాతావరణం, ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు ఈ వాతావరణమే మనిషి ప్రవర్తనను నిర్ణయించేది. ఈ ప్రవర్తనను నిర్ణయించేది ఓ విధంగా సంఘటనలు. ఇవే కథానికకు వస్తువులు కూడా. సంఘటనల కాణాచియైన జీవితంలో నుంచి కథావస్తువు గ్రహించి, తన ఉద్దేశ్యాలకనుగుణంగా పాత్రను చిత్రించేందుకు కథకుడు ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో సంపూర్ణ ఫలితాన్ని సాధించిన అపూర్వ కథకుడు పెద్దింటి అశోక్‌కుమార్.

❋

# జాషువా కవిత్వం - ప్రపంచీకరణ దృక్పథం

- యు. రమ్యజ్యోతి



*ఏ కవీ తన సమకాలీన సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులకు అతీతుడు కాదు. జాషువా కూడా అంతే. 19వ శతాబ్దపు నాటి జాషువా రచనలను ఈనాటి విమర్శనా దృష్టితో పరిశీలించినపుడు అతని రచనల్లో ఆనాటి యాంత్రీకరణ ఎలా ప్రతిబింబించిందో మనం గమనించవచ్చు, అయితే దీనిని ప్రపంచీకరణ దృక్పథం అని జాషువా పేర్కొనలేదు. ఆనాటికి ఆ మాట కూడా లేదు. అయితే మనదేశంపై ఇతర దేశాల అధిపత్యాన్ని గురించి, సాంకేతిక పరిజ్ఞానాన్ని గురించి, యాంత్రిక పరికరాల రాక గురించి అవి సమాజంలోని ప్రజలపై చూపే ప్రభావాన్ని గురించి సందర్భానుసారంగా పొందుపరిచాడు.*

ఆధునిక కాలంలో మనుషుల మధ్య సంబంధాలను వస్తు సంబంధాలుగా, ఆర్థిక సంబంధాలుగా మార్చినది ప్రపంచీకరణ. అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థిక, రాజకీయ విధానాలను ధనిక దేశాలు తమ స్వప్రయోజనాల కోసం నిర్దేశించింది కూడా ప్రపంచీకరణే. ఈ ప్రపంచీకరణ ప్రభావంతోనే అప్పటి వరకు ధనికుల విలాస వస్తువులుగా చెలామణి అయిన టీవీలు, కార్లు, రేడియోలు, మిక్సీలు, కంప్యూటర్లు, ఫ్రిజ్‌లు, వాషింగ్‌మెషిన్‌లు మధ్య తరగతి వారి అవసరాలుగా మారిపోయాయి. ప్రపంచీకరణ ఫలితంగా నిత్యజీవితావసరాలు తీరటం కోసం యంత్రాల మీద ఆధారపడిన మనిషి, తాను కూడా ఒక యంత్రంలా మారిపోతున్నాడు. ఈ ప్రపంచీకరణ మనుషుల మధ్య బంధాలను తుంచి సౌకర్యాలను పెంచింది.

ప్రపంచీకరణ ఆచార సాంప్రదాయాలు, ఆహారం, ఆహార్యం, భాష, వస్తువినియోగం ఆఖరికి మనిషి భావోద్వేగాలలో కూడా మార్పును తీసుకువచ్చింది. అయితే ప్రతీ మార్పు మంచికి కాదు. కొన్ని మార్పులు మానవాళి మనుగడకు శాపంలా పరిణమిస్తాయి. ప్రపంచీకరణ వల్ల వచ్చిన మార్పు కూడా అటువంటిదే. ప్రపంచంలో ప్రతీది ఒక సరుకని, దానికి ఒక విలువ, లెక్క వుంటాయని, దేన్నయినా కొనటం అమ్మటం సాధ్యమవుతుందనే "వినియోగదారీ సంస్కృతి" నేడు సమాజంలో విషవృక్షంలా వేళ్ళూనుకుపోవటానికి కారణం ప్రపంచీకరణే.

సమాజానికి హాని కలిగించే ఏ అంశాలనైనా కవులు, రచయితలు తమ రచనల ద్వారా ఎండగట్టినట్లుగానే, ఈ ప్రపంచీకరణ దుష్ప్రభావాలను కూడా ఎందరో తెలుగు కవులు, రచయితలు అక్షరీకరించారు. వ్యతిరేకించారు. విశ్వకవి జాషువా కూడా తన రచనల్లో ఆనాటి ప్రపంచీకరణ దృక్పథాన్ని నిరసించాడు. అయితే ఈ ప్రపంచీకరణ వున్నట్టుండి వచ్చిందేమీకాదు. సాంకేతిక, పారిశ్రామికాభివృద్ధి, సమాచార సౌలభ్యం పెరిగే కొద్దీ అది మిగిలిన దేశాల మీద ప్రభావం చూపుతూ వచ్చి ఈ శతాబ్ది మొదటి దశకంలో విశ్వరూపాన్ని దాల్చింది.

ఏ కవీ తన సమకాలీన సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులకు అతీతుడు కాదు. జాషువా కూడా అంతే. 19వ శతాబ్దపు నాటి జాషువా రచనలను ఈ నాటి విమర్శనా దృష్టితో పరిశీలించినపుడు అతని రచనల్లో ఆనాటి యాంత్రీకరణ ఎలా ప్రతిబింబించిందో మనం గమనించవచ్చు, అయితే దీనిని ప్రపంచీకరణ దృక్పథం అని జాషువా పేర్కొనలేదు. ఆనాటికి ఆ మాట కూడా లేదు. అయితే మనదేశంపై ఇతర దేశాల అధిపత్యాన్ని గురించి, సాంకేతిక పరిజ్ఞానాన్ని గురించి, యాంత్రిక పరికరాల రాక గురించి

అవి సమాజంలోని ప్రజలపై చూపే ప్రభావాన్ని గురించి సందర్భానుసారంగా పొందుపరిచాడు. తన రచనల్లో జాషువా రాసిన కొత్తలోకం కాందిశీకుడు, నాకథ, బాపూజి, రేడియో, ముసాఫరులు అనే ఖండకావ్యాలల్లో ఈ లక్షణం కన్పిస్తుంది.

*"కఠినచిత్తుల దురాగతములు ఖండించి*
*కనికర మొలకించు కలము నాది"* అన్న విప్లవ కవి జాషువా. జాషువా హేతువాది, అభ్యుదయవాది. నన్నయ్య జగద్ధితంబుగా భారతాన్ని రాస్తానన్నట్లుగా జాషువా.

*"యువ్వనుధాన్ధలిం బొడుమరే రసలుబ్ధలు ఘంటమూనెదన్*
*రవ్వలు రాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్"* అంటూ తన కవితా ప్రయోజనాన్ని ఆత్మవిశ్వాసంతో వ్యక్తీకరించాడు. అలాంటి జాషువా కవిత్వ దర్పణంలో ఆనాటి ప్రపంచీకరణ ప్రభావ ప్రతిబింబం ఎలా వుందో చూద్దాం.

కొత్తలోకం రచనాకాలం 1952, ఈ రచనా కాలంలోనే జాషువా సతీమణి పరమపదించడంతో, కొంతకాలం తర్వాత కొత్తలోకాన్ని పూర్తి చేసి, తన భార్యకే అంకితమిచ్చాడు. దేవుడితో చెప్పాలనుకున్న, ప్రశ్నించాలనుకున్న కొన్ని విషయాలను కొత్తలోకం పేరుతో అక్షరీకరించాడు.

*"అణుశక్తి ప్రళయంబు దెచ్చుకొని దుమైపోవ సంసిద్ధమై*
*రణభేరిన్ మొరయించు క్రూర మద గర్వగ్రస్తమై బంధురా*
*రుణ నేత్రంబయియున్న లోకమున నెహ్రూ వంటి శాంతిప్రియుల్*
*మణి పూసల్ గద నీయనంత కరుణా మాణిక్య హారావళికిన్"* అనే పద్యంలో ఆనాటి ప్రపంచీకరణ దృక్పథాన్ని గమనించవచ్చు. క్రమంగా పరిణామాభివృద్ధిని సాధించిన ఈనాటి ప్రపంచీకరణ అనబడే సాంకేతిక, పారిశ్రామిక వ్యవస్థల ప్రభావం వలనే భారతదేశంలో అణ్వాయుధాలు తయారువుతున్నాయి. అణ్వాయుధాల తయారీని, వాడుకను వ్యతిరేకించాడు జాషువా. నేడు అలాంటి అణుశాస్త్రాల వాడుకతో హింసతో కూడివున్న ఈ లోకంలో నెహ్రూ వంటి శాంతికాముకులు ఉండటం గొప్పే కదా! అంటూ నెహ్రూ వలె మనుషులంతా శాంతికాముకులు అగునట్లు దీవించమని దేవున్ని ప్రార్థిస్తాడు.

అంతేగాక నేడు కాలం మారిందని చెబుతూ

*"రోజులు మారిపోయినవి, రోజుకు రోజుకు దేవపూజపై*
*మోజులు సన్నగిల్లినవి. మోక్షము కద్దను నమ్మకాలపై*
*బూజు పరంజుకొన్నది....."* అంటూ ఆధునిక కాలంలో మానవులకు దేవుడిపై నమ్మకం సన్నగిల్లందని, రోజులు మారాయని దేవునితో చెబుతున్నాడు జాషువా. ప్రపంచీకరణ అనే దృక్పథం అప్పటికి మనదేశంలో ప్రవేశించలేదు. అయినా ఆ ఛాయలు మాత్రం జాషువా కాలం నుండే మనకు కన్పిస్తున్నాయి. మనదేశ ఆచార సాంప్రదాయాలపై ఇతర దేశాల ప్రభావం అప్పటికే ప్రారంభమయింది.

"యాంత్రిక జగత్తున మానవుని విజ్ఞానం వెఱ్ఱితలలు వేసింది. తత్ఫలితంగా మనుష్య కీటకపు చెన్నటి చేష్టలు శాంతియుత సహజీవనానికి భంజకాలుగా పరిణమించాయి. ఆధునిక యుగంలో విశ్వశాంతి కాముకులైన మేధావులను కలవరపెడుతున్న ఈ సమస్యను గూర్చే జాషువా ఈ కావ్యంలో వితర్కించినాడు" అని జాషువా కృతులపై పరిశోధన చేసిన డా॥ బి.భాస్కర చౌదరి గారు పేర్కొన్నారు. మితిమీరిన శాస్త్రవిజ్ఞానం లోకనాశనానికి కారణమని జాషువా అభిప్రాయం. ప్రపంచీకరణ ప్రభావాన్ని అర్థం చేసుకున్నవారే ఈ మాట అనగలరు.

ఆంధ్రుడైన ఒక బర్మా కాందిశీకుడు ప్రాణభయం వల్ల దేశాన్ని వదిలి ప్రయాణిస్తూ ఉండగా అతనికి ఒక కపాలం కన్పిస్తుంది. ఆ కపాలానికి, బాటసారికి మధ్య జరిగిన సంభాషణే ఈ కావ్యంలోని వస్తువు. కపాలం మీ యుగంలో వింతలు, విశేషాలు ఏమిటి? నాకు వివరించు అని బాటసారిని అడుగగా, బాటసారి ఈ క్రింది విధంగా చెబుతాడు.

*"ఇది నాజూకు యుగంబు పూర్వులకు లేవీలాటి సౌకర్యముల్*
*హృదయాహ్లాదక యంత్రవాహన శకం"* ఇదినాజూకు యుగం, అంతకు ముందు ప్రజలు అనుభవించని సౌకర్యాలెన్నో ఈ కాలం నాటి ప్రజలు అనుభవిస్తున్నారని, యంత్రాలే మానవుల జీవితాలను నడిపిస్తున్నాయని, యంత్రవాహన శకం అని పేర్కొన్నారు.

కాందిశీకుడు ఖండకావ్యాన్ని గురించి "అధునాతన సౌఖ్యాకాంక్షియైన అతని బుద్ధికి హృదయానికి మధ్య పూడ్చలేనంత అగాథమేర్పడింది. యాంత్రిక జ్ఞానాభ్యున్నతికి ప్రాధాన్యం లభించిన ఈ కాలాన్నే జాషువా ఈ ఖండకావ్యంలో 'నాజూకు యుగంబు' గా పేర్కొనడం జరిగింది" అని డా॥బి.భాస్కర రావు గారు పేర్కొన్నారు.

*"బుద్ధునంతటి మేమహాత్మునకా కాని*
*పలుకదానాటి యాకాశవాణి మీకు*
*ఇరువదియు నాల్గుగంటలు మొరయుచుండు*
*వాడవాడల జెవిమొగ్గువాడు లేడు"* అనే పద్యంలో ఇరవై నాలుగు గంటలు ఆకాశవాణి (Radio) హోరెత్తిస్తుందని, వాటిని వినని మనిషే ఈ లోకంలో లేడని, ప్రపంచీకరణ ప్రభావం మానవులపై ఎలా పడుతుందో విశదీకరించాడు. ఆ విధంగానే

ఈ క్రింది పద్యంలోను అంటాడు.

*"శాస్త్రములలోన నెన్నడో చదివియుందు*
*రమరు లెక్కిన ఘన విమానముల కథలు*
*మెలగునిపుడు నిరతంబు తలల మీద*
*మిన్న మార్మోయ నినుప తుమ్మెదల కరణి"*

దేవతల విమానమెక్కినట్లు విన్నాము తప్ప చూడలేదు. ఇప్పుడు తలెత్తితే ఇనుప తుమ్మెదల వలే ఆకాశంలో విమానాలు హోరెత్తిస్తుంటాయని దృష్టాంతాలతో వర్ణించాడు. ఇందులో వాడిన ఇనుప తుమ్మెదలు అన్న మాట ప్రపంచీకరణ ప్రతీక అని చెప్పవచ్చు.

*"కవుల కుపమాన సామాగ్రిని రచించి*
*మేఘసౌధాలు వెలిగించు మెరుపు లతలు*
*వలసినపుడె మాయిండ్లు బ్రజ్వరిల్లు*
*బరువు తక్కువ లితర దీపములు మాకు"* ఆకాశంలోని మెరుపుతీగలు కరెంటు దీపాల రూపంలో మా ఇళ్ళల్లో రోజూ మెరుస్తున్నాయని పేర్కొన్నాడు.

ఇవన్నీ కూడా ప్రపంచీకరణ ప్రభావంతో మన భారతీయ సమాజంలోకి ప్రవేశించినవే. ప్రపంచీకరణ ప్రభావం వల్ల మానవునికి ఎన్నో సౌకర్యాలు పెరిగాయి. వాటి వల్ల ఎన్నో నష్టాలు ఉన్నాయంటూ పరోక్షంగా హెచ్చరించాడు జాషువా. ఒకరకంగా చెప్పాలంటే జాషువా ప్రపంచీకరణకు వ్యతిరేకి మనదేశ సంస్కృతి, సాంప్రదాయాలను అనుసరించి గౌరవించే వ్యక్తి.

బాపూజీ అనే జీవిత చరిత్రలో

*"యావద్భారత భూమి కట్టుకొనియెన్ ఖాదీ జగావస్త్రము*
*బ్రోవుల్ వెట్టి దహించె సీమవసనంబునన్ జీల్చి చందాడుచున్*
*జైవెట్టెన్ బసిపిల్లయున్ భరతదేశ స్వేచ్ఛ నాశించుచున్"*

అని విదేశీ వస్తు బహిష్కరణను గురించి వర్ణించాడు.

గాంధీజీ విదేశీ వస్తు బహిష్కరణ ద్వారా ఆంగ్లదేశ ఆధిపత్యాన్ని వ్యతిరేకించాడు. అంటే మొదటి ప్రపంచీకరణ వ్యతిరేకవాది గాంధీయే అని చెప్పవచ్చు. స్వదేశీ పరిశ్రమలపై ఆంగ్ల దేశ పరిశ్రమల ప్రభావం వుందని, స్వదేశీ పరిశ్రమలు అభివృద్ధి పథాన నడవాలంటే విదేశీ వస్తువులను దేశంలోకి రానీయకూడదని అంతేకాక ఇతర దేశాల సంస్కృతికి భారతీయులు లోనుకాకుండా వుండటం కోసమే గాంధీజీ విదేశీ వస్తు బహిష్కరణోద్యమం చేశాడని జాషువా వివరించాడు.

*"ఇంటబైట పాదుకొనియె బరభాష నిషాపదార్థమై*
*యంటి పరంజుకొన్నది హిమాచల శృంగము దాక"*

అంటూ ఇతర భాషల పట్ల మత్తుపదార్థంలాగా భారతీయులు బానిసలయ్యారని పాశ్చాత్య దేశాలు భారతదేశంపై చూపే ప్రభావాన్ని వివరించాడు.

*"భారత దేశము వాసి, సీమ సరిహద్దుల్ ద్రొక్కిం గాక సా*
*గరపర్యంత విశాల భారతికి సౌఖ్యంబుండ దప్లే పర*
*స్పర విశ్వాసము భారతీయులకు సంప్రాప్తించు సత్యాదహా*
*స్థిర దీక్షారతురై యెదుర్కొనుదు ఖాదీ చక్రి చండాంశువై"*

కాబట్టి ఆంగ్లేయులు ఈ దేశాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోతే తప్ప భారతదేశానికి సుఖం ఉండదని, భారతీయ సమాజం సరిగ్గా ఉండదని, కాబట్టి ఆంగ్లేయులను తరిమికొడదాం రమ్మని ప్రజల్ని ఉత్తజితుల్ని చేస్తున్నాడు గాంధీజీ అంటూ జాషువా వర్ణించాడు. దీనిని బట్టి గాంధీజీని తొలి ప్రపంచీకరణ వ్యతిరేక వాదిగా జాషువా వర్ణించాడని చెప్పవచ్చు.

జాషువా స్వీయ చరిత్ర 'నా కథ'లో కూడా ప్రపంచీకరణ దృక్పథం కన్పిస్తుంది.

*"బూర్వ మెఱుంగని వింత పోకడల*
*కుప్పలు కుప్పలేంచు నెలకొన్నది దేశము నాల్గు మూలలన్"*

అని పేర్కొన్నాడు. ఇంతకు ముందెప్పుడూ ఎవరూ చూడని విషయాలు దేశమంతటా కన్పిస్తున్నాయని మారిన కాల పరిస్థితులను గురించి చెబుతున్నాడు.

*"అద్దం బాకయులేని స్వార్థ నిలయంబై బాంబు యుద్ధాలకున్*
*జెడ్డీ గట్టెదు నేటి యాంత్రిక యుగాన్ని జ్వాలికల్ రేగు నీ*
*గద్దుంగాలపు ధాంక నోర్చుకొని....."* అనే పద్యంలో నేటి కాలంలో స్వార్థం పెరిగిపోయి, బాంబు యుద్ధాలకు లోకం నిలయం అయిందని ఈ యుగాన్ని మొత్తం యాంత్రికతే నడిపిస్తుందంటూ పేర్కొన్నాడు జాషువ.

"పరిపూర్ణ నవ్యయౌవన విలాసమున నాంగ్లేయ శారద కన్నుగీటుచుండ వెలలేని రత్నకుండల మండితు ప్రజ్ఞ నగుబాట్ల కగ్గమై నవయుచుండ స్వస్థాన వేషభాష మోహ మొకవంక నేరమై చెరసాల జేరుచుండ పొగయోడ లెక్కియుబ్బులు దాటి పరతెంచి సీమ సంస్కృతి చెల్మి చేయుచుండ" అంటూ తాను నివసించిన కాలంలో దేశం నలుమూలలా ఆంగ్ల విద్య తప్పనిసరైందని, తెలుగు పండితుల అసాధారణ ప్రతిభ నగుబాట్లకు లోనవుతూ ఉందని, స్వదేశీ వేషధారణ, స్వభాష మాట్లాడటం నేరమై చెరసాలలో ఉండాల్సి వచ్చిందని, ఆంగ్లేయుల సామ్రాజ్యవాద దృక్పథాన్ని వివరించాడు జాషువ. ఈ సామ్రాజ్యవాద దృక్పథమే ప్రపంచీకరణ యొక్క మొదటి దశ అని చెప్పవచ్చు.

ఆ కాలంలోనే ఆంగ్లేయుల సంస్కృతిని తెలుసుకోవాలనే ఆసక్తి నాటి భారతీయులలో ఉండేదని, భారతీయులకు పరదేశ సంస్కృతి పట్ల గల ఆసక్తిని తూర్పారపట్టాడు జాషువ. అంతేగాకుండా ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ, మన సంస్కృతిని, భాషను పొగడుతూ

*"కలికి భాషనెవడు కాంక్షసేయు*
*ఆపదలకు గాని యందచందములున్న*
*ఆడుదాని వంటి దాంధ్ర కవిత"* అని పలికాడు

స్వయానా జాషువానే ప్రపంచీకరణ ప్రభావానికి లోనయ్యాడు. ఎలాగంటే జాషువ స్కూల్లో తెలుగు పంతులుగా ఉద్యోగం చేస్తున్నాడు. స్కూలును తనిఖీ చేయడానికి డీఇఓ వస్తున్నాడని, రాజా అనే మిత్రుని సలహాతో నల్లని సూటు, టై, నల్లటి బూట్లను ధరించి స్కూలుకు వెళ్ళాడట. ఆ డీఇఓ విదేశీయుడు. తనిఖీ ముగిసిన తర్వాత తెలుగు పండితుడేడీ? అంటూ జాషువానే అడిగాడట డిఇఓ. అదినేనే అని సమాధానమిచ్చాడు జాషువ. నేను అడిగింది. ఇంగ్లీష్ టీచర్ని కాదు, తెలుగు పంతుల్ని అని కోపంగా అన్నాడట ఆ డిఇఓ. అక్కడున్న పంతులందరూ ఇతడే తెలుగు పండితుడని చెప్పగా

*"ఇతదాంధ్ర పండితుం దని*
*కృతులున్ రచియింపగల కవీశ్వరుడంచున్*
*బ్రతిచెప్పె పెద్ద పంతులు*
*నతదేహుండగుచు గడువినమత్ దొరకున్"*

*"గుండు మీద పిలక కుండలమ్ముల జోడు*
*పండితులకు సహజ మండనాలు*
*పైన నింగిలీషులో నాంధ్రమా? పాత*
*పండితుండటంచు బలికె దొరయు"*

గుండుమీద పిలక, కుండలాలు తెలుగు పండితులకు సహజము. మరి మీరు దీనికి వ్యతిరేకంగా ఉన్నారు కదా అంటూ పలికాడట ఆ డియీవో.

నేడు ప్రపంచీకరణ ప్రభావానికి లోనుకావడం దాదాపుగా ప్రతీ మనిషికి తప్పనిసరైంది. ప్రపంచీకరణ ప్రభావానికి లోనుకాకపోతే వెనుకబడిపోతామేమో అనే భయం ఈనాటి మనుషుల్లో కన్పిస్తుంది. పై సంఘటనలో జాషువ పరిస్థితి కూడా సరిగ్గా అదేనేమో? వచ్చేది ఇంగ్లీషు దొర, తెలుగు పండితుడిలా పిలక, ధోవతీ ఎందుకు? వారికి నచ్చేట్లుగా ఉండాలని సూటు, బూటు ధరించాడు. కానీ విదేశీయులు మన దేశ సంస్కృతి, సంప్రదాయాలను గౌరవిస్తారు. అందుకేనేమో ఆ ఆంగ్ల డీయీవో జాషువ తీరును చూసి విమర్శించాడు.

*'నాల్గువందలిచ్చి నట్టిల్లు సగమిచ్చి*
*మెచ్చి చేతులార దెచ్చుకొంటి*
*రేడియో మోషీను చేడిమా! దయచేసి*
*పాడకమ్మ చలిది పాట"* అంటూ రేడియో అనే ఖండ కావ్యంలో ఆకాశవాణి పట్ల గల వ్యతిరేకతను తెలియజేశాడు. రేడియో ప్రపంచీకరణ ప్రభావంతోనే మనదేశానికి ప్రవేశించింది. కానీ తరువాతి కాలంలో ఆ ఆకాశవాణి సంస్థలోనే జాషువా ఉద్యోగాన్ని నిర్వర్తించవల్సి వచ్చింది.

ముసాఫరులు కవితలో

*'ధ్వజములతో పలు రకముల*
*యిజముల తలసూపి విశ్వహిత నాదములన్*
*గజి గజి చేయుచున్నవి"* అంటూ పేర్కొన్నాడు.

*"అమెరికా రషియాలను దే*
*శములు సుహృద్భావములను సాధించి ప్రపం*
*చమునకు శమదమ ఋజు మా*
*ర్గములం జూపించే భరత ఖండము గుర్వై"*

భారతదేశం ప్రపంచ దేశాలతో స్నేహాన్ని సంపాదించింది. అన్ని దేశాలు శాంతి, సౌభాతృత్వం అనే లక్షణాలను భారతదేశం నుండే నేర్చుకుంటున్నాయని భారతదేశం యొక్క గొప్పదనాన్ని కీర్తించాడు జాషువ. అంతేగాక తెలుగు జాతి గొప్పదనాన్ని ఈ క్రింది విధంగా కీర్తించాడు.

*'తూరుపు టిటలేనియం బని*
*పేరొందిన తెల్గుభాష పెంపారుధరన్*
*వీరలకులంబున బుట్టితి*
*పౌరుష గుణ ముగ్గుబాల బడసినవాడన్"* అంటూ ప్రపంచ దేశాల సంస్కృతిని, భాషలను, వ్యవహారాలను, శైలిని అనుసరించే మనదేశ ప్రజలకు మన భారతదేశ ఔన్నత్యాన్ని, అందులో తెలుగు జాతి, భాష గొప్పదనాన్ని వివరించాడు.

స్వభాషాభిమానం, స్వదేశాభిమానం అనే పదాలు కూడా ఒక రకంగా ప్రపంచీకరణ దృక్పథాన్ని వ్యతిరేకమనే చెప్పవచ్చు. జాషువా రచనల్లో సామ్రాజ్యవాద నిరసన ప్రపంచీకరణ ధృక్పథ నిరసన మాత్రమే కాక, స్వభాష, స్వదేశాభిమానం కూడా మెండు అని అర్థమవుతుంది.

❋


13.08.1921 - 25.11.2016

# కాస్ట్రో - విప్లవ మేస్ట్రో

✻ తెలకపల్లి రవి

*ప్రళయ వేగంతో కడలి కెరటాలు వెనక్కు నెడుతున్నప్పుడు ప్రగతి నిరోధకత్వం కోరలు చాచి కబళిస్తున్నప్పుడు కాళ్లకింద భూమి కదలిపోతున్నప్పుడు ఆ అగ్నిపరీక్షను తట్టుకుని నిలవడానికి అసమానమైన ఆత్మవిశ్వాసం కావాలి. అజేయమైన ఆశయ బలం కావాలి. అలాటి అచంచల స్ఫూర్తితో ఆఖరివరకూ నిలిచాడు గనకే కాస్ట్రో మన కాలపు మహాయోధుడైనాడు. చరితార్థుడైనాడు. చరిత్రాంతం చెప్పిన వారికి జవాబుగా చరిత్రను మిగిల్చాడు.*

**మృ**త్యువంటే భయం లేని మనిషి పాడుతున్న పాట ఇది.. అంటూ మొదలవుతుంది ఘంటసాల గీతం - బహుదూరపు బాటసారి.. ఈ రోజు సభ్య ప్రపంచం మొత్తం నివాళులర్పిస్తున్న ఆ మనిషి ఒకసారి కాదు- 638 సార్లు మృత్యువును ఆ మృత్యుదూతలనూ దైత్యులనూ కూడా ధిక్కరించాడు. వెక్కిరించాడు. మృత్యుంజయుడనే మాటను కూడా దాటేశాడు. ఆయన మృత్యుకరచాలనాన్ని ఆమోదించిన తర్వాత కూడా ఈ దైత్యుల కళ్లు తెరుచుకున్నది లేదు. కనుకనే ఫైడెల్ కాస్ట్రోకు ధరిత్రి ఎర్రపిడికిలి బిగించి వీడ్కోలు పలుకుతున్నా అమెరికా అధ్యక్ష విజేత ట్రంప్ అవాకులు పలికి కుసంస్కారం చాటుకున్నారు. బ్రిటన్ అధికారికంగా విచారం ప్రకటించకపోగా అంత్యక్రియలకు కూడా తక్కువ స్థాయి ప్రతినిధులను పంపింది. ఇక గ్లోబల్ లోకల్ మీడియాలో కాస్ట్రోకు మరోవైపును చూపించే ప్రక్రియ తీవ్రస్థాయిలో సాగుతున్నది. మరణానంతరం కూడా కాస్ట్రో జైత్రయాత్ర కొనసాగుతున్న తీరుకు ఉదాహరణలే ఇవన్నీ. వీరుడు మరణించడూ విప్లవం మరణించదూ అని ఆరుద్ర రాసిన పాట కాస్ట్రోకు అక్షరాక్షరం వర్తిస్తుంది.

ప్రళయ వేగంతో కడలి కెరటాలు వెనక్కు నెడుతున్నప్పుడు ప్రగతి నిరోధకత్వం కోరలు చాచి కబళిస్తున్నప్పుడు కాళ్లకింద భూమి కదలిపోతున్నప్పుడు ఆ అగ్నిపరీక్షను తట్టుకుని నిలవడానికి అసమానమైన ఆత్మవిశ్వాసం కావాలి. అజేయమైన ఆశయ బలం కావాలి. అలాటి అచంచల స్ఫూర్తితో ఆఖరివరకూ నిలిచాడు గనకే కాస్ట్రో మన కాలపు మహాయోధుడైనాడు. చరితార్థుడైనాడు. చరిత్రాంతం చెప్పిన వారికి జవాబుగా చరిత్రను మిగిల్చాడు. నవయువకుడుగా నియంత బాటిస్టా నిరంకుశదుర్గాన్ని పట్టుకోబోయి పట్టుబడి శిక్షకు గురైనప్పుడే చెప్పాడు- చరిత్ర నన్ను నిర్దోషిగా నిరూపిస్తుంది (హిస్టరీ విల్ అబ్జాల్వ్ మీ) అని. తొంభైఏళ్ల సంపూర్ణ సార్థక జీవితం ముగింపు తర్వాత కూడా ఇంకా ఆయన దోషాలే వెతకడానికి పరితపించే వారి చారిత్రిక జ్ఞానానికి జాలిపడవలసిందే. కాస్ట్రో కమ్యూనిస్టు కాదన్నమాట కూడా అపార్థం చేసుకుంటే అనర్థమే. ఆయన వారితో కలసి పనిచేయడానికి సిద్ధంగా వున్నా వారే పిడివాదంలో పడిపోయారన్నది అప్పటిమాట. తర్వాత ఆయనే కమ్యూనిస్టు అయ్యారు. ఆఖరిదాకా అందుకు ప్రతీకా అయ్యారు.

అమెరికా ఖండంలో అరుణతార ఆవిర్భావం. అమెరికాకు తొంభై మైళ్ల దూరంలో సోషలిస్టు క్యూబాను స్థాపించడం నాటికీ నేటికీ సంచలనమే. అమెరికాకు పెరటిదొడ్డిలాటి విలాస క్షేత్రం లాటి క్యూబా పక్కలో బల్లెంలా కొనసాగడం

వూహాతీతమైన వాస్తవం. ఆ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే అమెరికా చమురు పంచదార, పర్యాటకం, దౌత్య సంబంధాలు ప్రతి విషయంలోనూ ఆంక్షలూ నిషేధాలతో విరుచుకు పడింది. 1962 ఫిబ్రవరిలో ప్రకటించిన ఈ దిగ్బంధాన్ని అధిగమించి క్యూబా నిలదొక్కుకోవడం కాస్ట్రో పాలనా దక్షతకు నిదర్శనం. విప్లవానంతరం 1959 మే15న ప్రకటించిన వ్యావసాయిక చట్టం ఒక్క రాత్రిలో లక్షలాది రైతులకు భూవసతి కల్పించింది. పారిశ్రామికాభివృద్ధికి కృషి జరిగింది. ఈ క్రమంలో కూడు గుడ్డ, నీడ, విద్య వైద్యం అనే పంచాక్షరి మంత్రంగా ప్రజలను ఉత్తేజపరుస్తూ వాస్తవాలు వివరిస్తూ కాస్ట్రో పాలన సాగింది. గెరిల్లాగ తాను ధరించిన ఆలివ్ గ్రీన్ యూనిఫాం తీయకుండానే ప్రపంచాధినేతల సరసన ప్రతిష్ఠితుడైనాడు. ఆనాటి బలీయమైన సోషలిస్టు దేశాలు సోవియట్ యూనియన్, చైనాలకు కూడా కాస్ట్రో ఎప్పుడూ తోకగా వ్యవహరించింది లేదు. 1962లో బే ఆఫ్ పిగ్స్‌లో సోవియట్ మిసిలీలు బయటపడటం, దానికి ముందు అమెరికా కుట్రలు వీటిపై చాలా వివాదం నడిచింది. ప్రపంచం మరో యుద్ధాన్ని చూస్తుందేమోనన్నంత వరకూ వెళ్లింది. అయితే కాస్ట్రో ఎంతో చాకచక్యంగా బాధ్యతాయుతంగా సంక్షోభాన్ని శమింపచేశారు. శిశుమరణాల రేటు తగ్గింపు. సగటు ఆయుర్దాయం విషయంలో క్యూబా ప్రపంచంలోనే అగ్రస్థానంలో వుంది. రోగనిరోధక పరిశోధనల్లో ముందు నిలిచింది. క్యూబాకు చెందిన 35 వేలమంది వైద్యులు వివిధ దేశాలలో తమ అనుభవాలు చెబుతున్నారంటే నాకెంతో గర్వంగా వుంది అన్నాడు కాస్ట్రో. తెలుగు రాష్ట్రాల ఆరోగ్యశ్రీలు మొదలుకొని అమెరికాలో ఒబామా హెల్త్‌కేర్ వివాదాల వరకూ చూస్తే ఈ విజయం ఎంత విశిష్టమైందో తెలుస్తుంది. ఈ పథకాలతోనే ఓట్లు కురుస్తాయని చెప్పుకునేవారు దశాబ్దాల పర్యంతం ఆ సదుపాయాలు ఉచితంగా సమర్థంగా అందిస్తున్న కాస్ట్రోను ప్రజలు ప్రేమించడం లేదని అణచివేతలో వున్నారని వికృత భాష్యాలు చెప్పడం విపరీతమే. వందలాది హత్యా ప్రయత్నాలు దేశాన్నే దెబ్బతీసే ప్రయత్నాల నేపథ్యంలో కఠిన చర్యలు తీసుకుని వుండొచ్చు గాని వాటికి నియంతృత్వ ముద్ర వేయడం చెల్లుబాటయ్యేదేనా?

**ఈ క్రమంలో కూడు, గుడ్డ నీడ, విద్య వైద్యం అనే పంచాక్షరి మంత్రంగా ప్రజలను ఉత్తేజపరుస్తూ వాస్తవాలు వివరిస్తూ కాస్ట్రో పాలన సాగింది. గెరిల్లాగ తాను ధరించిన ఆలివ్ గ్రీన్ యూనిఫాం తీయకుండానే ప్రపంచాధినేతల సరసన ప్రతిష్ఠితుడైనాడు.**

639 హత్యాప్రయత్నాలు తప్పించుకున్న కాస్ట్రో ఇద్దరు గార్డులతో నిరాటంకంగా నిస్సంకోచంగా సంచరించారు. ఆయన జీతం కేవలం 30 డాలర్లే. తన విప్లవ సహచరుడైన చే గువేరా అయితే విప్లవపోరాటం తర్వాత పాలనలో పాలు పంచుకోకుండా ఇతర లాటిన్ అమెరికా దేశాల విముక్తికోసం తరలిపోయాడు. ఆసమయంలో చే రాసిన లేఖ గుండెలను పిండేస్తుంది. కాస్ట్రో నాయకత్వ పటిమను మరింత ముందే అర్థం చేసుకోలేకపోయానని విచారిస్తాడు చే. ఆయనను కాల్చిచంపింది అమెరికా సైన్యాలైతే ఆ నింద కూడా ఆయనపైనే వేశారు. అలాటి సమయంలోనే కాస్ట్రో అనివార్యంగా చే లేఖలు బయటపెట్టాల్సి వచ్చింది.
ఎ ా
స్మృతిలో చే గువేరా, నా తొలిజీవితం, భావాలు అనుభవాల వంటి ఆయన రచనలు తెలుగులో ప్రజాశక్తి ప్రచురించింది, వాటిని చదివితే కలిగే ఉత్తేజం వర్ణనాతీతం. నోబుల్ గ్రహీత గాబ్రియేల్ మార్క్వెజ్ తొలి జీవితం పుస్తకానికి రాసిన ముందుమాట కాస్ట్రో వ్యక్తిత్వం కళ్లకు కడుతుంది. కట్టుకథలు పటాపంచలు చేస్తుంది. పుస్తకాలు పత్రికలు విపరీతంగా చదవడమే గాక విస్తృతంగా రాసే అలవాటున్న కాస్ట్రో తన హత్యకు జరిగిన కుట్రల వైఫల్యాలను అక్షరబద్ధం చేశారు. 2007 జూన్ 28న కాస్ట్రో సరదాగా నన్ను హత్యచేయాలని ఆదేశించిన అధ్యక్షుల పన్నాగాల నుంచి ఆ దేవుడే నన్ను కాపాడాడన్నమాట అని చమత్కరించారు! ఐసెన్ హెూవర్ నుంచి ఒబామా వరకూ 11 మంది అమెరికా అధ్యక్షులతో ఆడుకున్న అరుణ పాలకుడుగా ఆయనకు పేరు. చివరకు దిగిపోయే ఒబామానే వెళ్లి రాజీ చేసుకున్నారు గానీ కాస్ట్రో తలవంచింది లేదు.

ముప్పై ఏళ్లకిందట గోర్బచెవ్ సోవియట్ పగ్గాలు చేపడితే అయిదేళ్లలో ఆ దేశమే విచ్ఛిన్నమైంది. ఆ కాలంలో కాస్ట్రో అనుక్షణం అప్రమత్తత బోధించడమే గాక అన్ని సవాళ్లకు సిద్ధం చేసుకుంటూ వచ్చాడు. మేమైతే శ్రామిక వర్గ దృక్పథం వదులుకోబోమని గర్జించాడు. సోషలిజం లేదా మరణం అని ఆయన నినదించినప్పుడు చాదస్తం అనుకున్నవారున్నారు. కాని ఆ కాలానికి ప్రత్యేక పరిస్థితి అని పేరుపెట్టి అనేక పరిమితులు పొదుపులూ పాటించి దేశాన్ని కాపాడుకున్నారు. వీటిని తప్పు పట్టిన వితండవాదులతోనూ పోరాడి వాస్తవికత చాటుకున్నారు. ఆ సమయంలో మనదేశం కూడా సంఘీభావం

# గంధాలను అద్దుకుంటూ



- సి హెచ్.వి.లక్ష్మి
9493435649

రానున్నసంవత్సరం అభివృద్ధికి సంకేతమట
పండగ రోజుల్లో బ్యాంకుల ముందు
బొచ్చె చేత బట్టి దేబిరిస్తున్న సమూహ బారులు

కరెన్సీ కాటుకు బడుగుజీవి బలైన వేళ
కూలి -నాలి - పని-పాట - ఉద్యోగం - సద్యోగం
అసలు ఏమీ గుర్తు రావటం లేదు

ఏ ఒక్క వరమైనా అడుగు
ఆ ఒక్క కరెన్సీ తప్ప అంటూ దున్నపోతు పైకెక్కి
సవారీ చేస్తూ యమపాశాలు విసురుతుంటే
ఇక వచ్చే కాలం బంగారు కాలము అని
ఎలా అనుకోవాలో మరి

నెల వెచ్చాలు ,పాలు నీళ్ళ కు కూడా
పూట కూలీలా మారిన వేతన జీవులు
నెల మొత్తం రూ 5000/కూడా
కంట పడక అల్లాడుతున్న చిరు వ్యాపారులు
కష్ట జీవులు కరెన్సీ కాష్టంలో కాలుతూ అల్లాడుతుంటే ,
అర అంగుళం కూడా పురోగమనం కనరాని వేళ
విదేశీ సభలలో సంభరంగా చేస్తున్న
అభివృద్ధి ప్రసంగ సోయగాలు.

కత్తెర బోనులో నిలబడి సాము చేస్తున్న
సామాన్యుడి భాధ, బలిసినోడికి తెలిసొచ్చేదెప్పుడు?
నోటుకోసం లైను కాసి నిలబడ్డ బలిసినోడి జాడ
మాయాదర్పణంలో వెతికినా కనపడదేమి?

కష్టంకు, సుఖంకు, ఉద్వేగం లో ఉద్యమం లో
రాటుదేలిన బక్కప్రజల నడ్డి విరగొట్టి
నడవలేని స్తితిలో నడిరోడ్డున పడేసినా నిరాశ పడక

గత గంధాలను అద్దుకుంటూ
వర్తమానం దిద్దుకుంటూ
వచ్చేకాలం బహుదొడ్డ కాలం అన్న ఆశతో
కొత్త సంవత్సర శుభాకాంక్షలు
చెప్పుకుంటూ స్వాగత గీతికలు ఆలపిస్తూ
సాగిపోతున్న కష్టజీవి

❋

---

తెల్పడమే గాక సహాయసామగ్రి పంపింది. దానికి గాను విశాఖ కార్మిక నాయకులకు స్వయంగా కృతజ్ఞతల ఉత్తరం రాసిన వినమ్రశీలి కాస్ట్రో. ఈ కాలంలో తాను నిలబడడమే గాక లాటిన్ అమెరికా అంతటా చావేజ్ వంటివారి చొరవతో ప్రగతిశీల ప్రభుత్వాలకు పెద్దన్నగా భుజం కాచాడు. ఏకధృవ ప్రపంచ గీతాలాపనల మధ్య అమెరికా ఖండంలోనే ప్రత్యామ్నాయానికి ప్రేరణ అయ్యాడు. చావేజ్ మరణానంతరం వెనిజులాతో సహా చాలాచోట్ల సరికొత్త కుట్రలు మొదలైనాయి. క్యూబాపైనా అలాటి సందేహాలు కథలూ వస్తున్నాయి గాని అవన్నీ విఫలం కాక తప్పదు. సోవియట్‌లో జరిగింది రాజకీయ సైద్ధాంతిక ఆత్మహత్య తప్ప ఇతరులు అంతం చేయడం కాదు. చైనా శక్తి గురించి సందేహమే లేదు. పుచ్చిన మిరియాలైనా జొన్నల కంటే మేలని ఇప్పటికీ అమెరికాను నిలవరించగల సత్తా రష్యాకూ వుందని సిరియా ఘటనలు చెబుతున్నాయి. కాస్ట్రో అనంతరం క్యూబా ఏమవుతుందని జోస్యాలు చెప్పేవారు ముందు ట్రంప్ హయాంలో అమెరికా అధ:పతనం అంచనాలను కప్పిపుచ్చి వంచిస్తున్నారు. నిజానికి కాస్ట్రో చివరి దశలో ముందే ఐచ్ఛికంగా వైదొలగి నూతన నాయకత్వ వ్యవస్థను నెలకొల్పాడు. గత మహాసభలో నేను నిష్క్రమిస్తున్నానని నేరుగా చెప్పాడు. అయితే మనం పోయినా మన మహత్తర ఆశయాలకు మరణం వుండదనే మహోన్నత విశ్వాసం ప్రకటించాడు. చరిత్ర ఆ విశ్వాసాన్ని నిలబెడుతుందని నిలబెట్టాలని కోరుకుందాం. ❋

# నిర్ణయం

- డా॥ ఎం. హరికిషన్
9441032212



ఏదో స్నేహితుని పుట్టినరోజని... అందరూ వెంటబడితే... అదీ బీరు మాత్రమే గొణిగినట్లుగా అన్నాడు పదోతరగతి చదువుతున్న వినోద్.

"అవ్రా... ఈ రోజు బీరంటావ్, రేపు హోటలంటావ్, ఇట్లాగే వదిలేస్తే సక్కగ నెత్తి మీదకెక్కుతావు. గింతలేవు అప్పుడే స్నేహితులుట, సరదాలుట. ఇప్పన్నించి బైటికడుగు పెట్టి చూడు... కాళ్ళిరగ్గొడ్తా ఏమనుకుంటున్నావో" అంటూ కోపంగా మత్తులో వూగుతున్న కొడుకు చెంప మీద ఈడ్చి ఒక్కటి పెరికినాడు సుధీర్.

వాడు పోయి దభీమని కిందపన్నాడు. మత్తులో బుస్సుమని కోపం పొంగుకొచ్చింది. సర్రున పైకి లేచి నిలబడి "నేనేం నీ మాదిరి రోజూ గంట గంటకూ తాగి రోడ్ల మీద పడి పొర్లాడ్డంలా... పెద్ద క్లాసు పీకుతున్నావ్ పో... పోయి ముందు నీ సంగతి చూసుకోపో" అన్నాడు ఏలు చూపిస్తూ.

ఆ మాటలకు సుధీర్ కోపంతో వూగిపోయినాడు. వేగంగా ముందుకు వచ్చి వాని జుట్టు పట్టుకొని "ఏరా...తాగొచ్చింది గాక మళ్ళా నాకే ఎదురు చెబుతావా నువ్" అంటూ వంగబెట్టి దబదబదబ నాలుగు గుద్ది గది లోపలికి దొబ్బి గడ పెట్టినాడు.

కోపంతో సుధీర్ ఒళ్ళు ఒణుకుతూ వుంది. గస బెడతా వున్నాడు. బెరబెరా లోపలికి పోయి ఒక గ్లాసు తెచ్చుకోని జేబులోంచి క్వార్టర్ బైటకు తీసి దాన్లో పోసుకొని నీళ్ళు కలిపినాడు.

ఇదంతా గదిలో ఒక మూల కూచోని తనకేమీ పట్టనట్లుగా నిర్లిప్తంగా చూస్తోంది సుధీర్ పెళ్ళాం మాధవి. ఒక్కసారిగా సుధీర్ కోపం కొడుకు మీద నుంచి పెళ్ళాం మీదకి మళ్ళింది.

"ఏం చేస్తున్నావ్ నువ్. ఫుల్లుగా తినడం, గమ్మున పడుకోడం అంతేనా.... పిల్లలు యాడ తిరుగుతున్నారు, ఏమి సేస్తున్నారు తెలుసుకునేది ల్యా" అన్నాడు కోపంగా.

ఆ మాటలకు మాధవి తలెత్తి గమ్మున మొగుని కళ్ళలోకి ఒకసారి సూటిగా చూసి మళ్ళా తల తిప్పుకోనింది.

"ఇట్లా మూగెద్దులెక్క మట్టసంగా పడుండబట్టే కొంపిల్లా తగలబడింది. కొంచమన్నా సూసుకునేదుందా లేదా పిల్లల్ని" అన్నాడు మరోసారి రెట్టించి.

ఆ మాటలకు ఆమెకు చిర్రెత్తుకోనొచ్చింది. "అవ్...నాకు సూసుకోవడం తెలిస్తే ఈ కొంప ఇట్లెందుకుంటాది. ఇప్పటి వరకూ నువ్వొక్కనివే అనుకున్నా.

ఇప్పుడు ఇద్దరు తగలబన్నారు. ఐనా ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా ఏమి? ఇప్పన్నించే వచ్చినాయి వానికి నీ బుద్ధులు. థూ ఎదవ జన్మలు. ఎదవ జన్మలు. ఎదవ బతుకులు. ఎవన్నని ఏం లాభం... అంతా నా కర్మ గానీ" అనింది చెంగుతో కళ్ళలోంచి కారుతున్న నీళ్ళు తుడుచుకుంటూ.



లోపల కొడుకుకి ఇంకా మత్తు దిగినట్టు లేదు. ఏదేదో తిడుతూ తలుపులు దబదబా బాదుతున్నాడు.

"ఏందే నోరు లేస్తోంది, నీకు గూడా పడాల్నా చెప్పు" అంటూ ఒక్కుదుటున గ్లాసెత్తి గటగటా తాగేసినాడు.

"తాగు... ఇట్లాగే సిగ్గూశరం లేకుండా ఇంటాబైటా తాగు. నీ వల్ల ఎట్లాగూ నా బదుకు నాశనం అయింది. ఇపుడు వాడు, రేపో ఎల్లుండో నీ చిన్నకొడుకు. రోజూ నువ్ ఇంట్లోంచి బైటకు పోయి తిరిగి వచ్చేంత వరకూ ఒకటే టెన్షన్. ఎపుడు ఎక్కన్నించి ఏ ఫోను వస్తాదో అని. దాంతోనే అప్పుడే నాకు బీపీ, షుగరు వచ్చేసినాయి. ఐనా పెండ్లయిన కాన్నించి ఇంటిపనులు, బైటిపనులు నేను సూసుకోకపోతే నువ్వు సూసుకుంటున్నావా... అవసరానికి ఏ రోజు పలికినావని. ఆఖరికి పోయిన్నెల చిన్నోడు రాత్రి కాలు జారి మెట్ల మీంచి కిందపడి తల పగలగొట్టుకుంటే..." మాటలు రాక దు:ఖంతో ఆమె గొంతు బూడుకుపోయింది.

సుధీర్ ఆమె ఏడుపు చూసి "థూ ... ఎప్పుడూ ఎదవ సొద... అందుకే ఒక్క క్షణం గూడా వుండబుద్ధి కాదు ఈ ఇంట్లో" అంటూ విసురుగా లేచి గబగబా చెప్పులేసుకోని బైటకడుగు వేసినాడు.

"పో ... ఇదేం కొత్తకాదు పో నాకు. ఏదో ఒకరోజు ఇంటికొచ్చేసరికి నా శవం వేలాడుతుంటాది గుమ్మం వద్ద. అపుడు తెలుస్తాది పెండ్లామంటే" లోపల నుంచి ఏడుస్తూనే అనింది మాధవి.

సుధీర్ అడుగులు రోడ్డు మీద వేగంగా పడుతున్నాయి. కళ్ళ ముందు మాటిమాటికీ తూలుతా, ఎదురు తిరుగుతున్న కొడుకే కనబడుతున్నాడు. ఆఫ్టాల్ పదోతరగతి అప్పుడే మొదలు పెట్టినాడంటే ... మనసంతా గజిబిజిగా, అసహనంగా వుంది. అసలు దీనికంతా కారణం నేనేనా ... వదిలించుకోలేని నా అలవాట్లేనా ... ఆలోచనలు మనసును తొలుస్తా వున్నాయి.

సుధీర్‌కి తండ్రి చిన్నప్పుడే చనిపోవడంతో కారుణ్య నియామకం కింద ఇంటర్ పూర్తికాగానే ఉద్యోగం వచ్చింది. ఒక తమ్ముడు, చెల్లెలు, సుధీర్ అందరికన్నా పెద్ద. అక్షరం ముక్కరాని తల్లికి జీతం ఎంత వస్తుంది. ఎంత ఇస్తున్నాడు అనేవి అర్థమయ్యేవి కావు. దాంతో తాను ఆడింది ఆట, పాడింది పాటగా తయారైంది. చేతి నిండా డబ్బులుండటంతో చుట్టూ స్నేహితులు. మంచీ చెడు తెలీని వయసు. సరదాగా మొదలై నెమ్మదిగా అలవాటై పోయింది. పెళ్ళయినా పెద్దగా మార్పు రాలేదు. బంధువులంతా నచ్చజెప్పినారు. తిట్టినారు, గొడవపన్నారు ... ఐనా మారలేదు. ఇంగ వీన్ని మార్చడం మా వల్ల కాదంటూ ఆఖరికి పెళ్ళాంతో సహా అందరూ వదిలేసినారు. సుధీర్ రోజూ ఆఫీసు నుంచి సక్కగా ఏదో ఒక బారుకి పోయి ఫుల్లుగా తాగి ఇంటికి రావడం మొదలు పెట్టినాడు. అప్పుడప్పుడు పొద్దున గూడా తాగి ఆఫీసుకి పోయేవాడు. మొదట్లో కొలీగ్స్ తిట్టేవాళ్ళు, పై అధికారులు హెచ్చరించేవాళ్ళు. కానీ కొంతకాలానికి వాళ్ళకీ అలవాటైపోయింది. 'థూ తాగుబోతు నాకొడుకు. వీనికి చెప్పినా ఒకటే, ఆ బండకు చెప్పినా ఒకటే' అనుకుంటూ పట్టించుకోవడం, పలకరించడం మానేసినారు.

సుధీర్ కాళ్ళు ఆలోచనల్లోనే అలవాటుగా సీ క్యాంపు రైతుబజార్‌కి ఎదురుగా వున్న బారులోకి చేరుకున్నాయి. పక్కనే బస్టాపు వుండడంతో ఒక వైపు వూర్లకు పోయే జనాలు, మరొకవైపు రైతుబజారుకు వచ్చే జనాలతో చానా సందడిగా వుంది. సుధీర్‌ని చూడగానే వెయిటర్ వెకిలిగా నవ్వుతూ "ఏం సార్ ... ఇప్పుడు గదా తీసుకోని పోయినావు. అప్పుడే దిగిందా" అన్నాడు.

సుధీర్ వాని వంక ఒకసారి కోపంగా చూసి క్వార్టర్ గ్లాసులో ఒంపి నీళ్ళు కలిపి ఒక్కుదుటున ఎత్తి కిందపెట్టినాడు. మరో క్వార్టర్ తీసుకోని జేబులో పెట్టుకోని బైటకు అడుగు వేస్తుంటే ఎదురుగా సతీష్ కనబన్నాడు. చిన్ననాటి స్నేహితుడు. సినిమాలు, షికార్లు ... ఇక కలిసి తాగిందయితే లెక్కేలేదు. పొద్దున్నుంచీ రాత్రి వరకు తింటా తిరుగుతా ఏ అర్ధరాత్రో ఇంటికి పోయిన రోజులు అనేకం. కానీ దాదాపు ఐదు సమ్మచ్చరాలైంది కనబడక, కలవక, కర్నూలు వదిలేసి ఆదోనికి వెళ్ళిపోయినాడని మాత్రం తెలిసింది. అంతే ... అప్పన్నించీ ఎటువంటి సమాచారమూ లేదు.

"రేయ్ ... సతీష్" గట్టిగా అరిచినాడు బారు లోపల

నుంచే, సతీష్ ఆగిపోయినాడు. పరుగున పోయి గట్టిగా కౌగిలించుకున్నాడు. "ఏరా ... దొంగనాకొడుకా ... ఎన్ని రోజులైంది నిన్ను చూసి, ఏమైపోయినావు. ఎక్కడున్నావు. ఫోన్ గూడా చేయలేదే ఒక్కసారైనా ... బాగా బలిసిందిరా నీకు" అంటున్నాడు సంతోషంతో ... చనువుతో



..సతీష్ ఏమీ మాట్లాడలేదు. "సరే ... దా ... లోపలికి పోయి మాట్లాడుకుందాం. శానా రోజులైంది నీతో కలసి కూచోక" అన్నాడు చేయిపట్టుకొని బార్ వైపు లాగుతూ,

సతీష్ సున్నితంగా చేయి విడిపించుకొని "వద్దురా ... మానేసి చానా దినాలవుతోంది. కాఫీ తాగుదాం పద" అన్నాడు.

సుధీర్ వాని చేయి వదిలేసి విచిత్రంగా చూస్తూ "ఏరా ... నువ్వేనా ఈ మాట అంటోన్నది. లేక తమాషాగానీ చేస్తున్నావా" అంటూ ఒక్కక్షణమాగి చుట్టూరా చూస్తూ "కొంపదీసి మా చెల్లెలు గానీ వస్తుందా వెనుక" అన్నాడు కన్నుగీటుతూ.

వాడు నవ్వి "అదేం లేదురా.. నిజంగానే మానేసినా .. మా అమ్మ మీద ఒట్టు ... సరేనా" అన్నాడు చేతిలో చేయి వేస్తూ.

సుధీర్‌కు చానా ఆశ్చర్యమేసింది. సుధీర్ క్వార్టర్ తాగే లోపల వాడు ఆఫ్ బాటిల్ పూర్తి చేసేటోడు. రోజూ రాత్రయితే చాలు. ఒక్కక్షణం గూడా ఆగడు. కర్నూల్లో వున్న ప్రతి వైను షాపు వానికి తెలిసినదే. ప్రతి వెయిటర్ స్నేహితుడే. డబ్బులున్నా లేకున్నా పర్లేదు. జీతం రాగానే ఎవరి బాకీ వాళ్ళకి పైసా పైసా లెక్కగట్టి ఇచ్చేటోడు. తాగకుండా పన్నుకున్న రోజే లేదు. అట్లాంటిది వాని నోటి వెంట అలాంటి మాట ... ఎప్పుడూ వూహించనిది...

ఇద్దరూ రైతు బజార్ పక్కనే వున్న క్యాంటీన్‌కు చేరుకున్నారు. సుధీర్ సిగరెట్ అంటిస్తూ పెట్టె ముందుకు తోశాడు.

"ఏందీ సిగరెట్ గూడా మానేసినావా ... అసలు నువ్వు నా ఫ్రెండ్ సతీష్‌వేనా... లేక తాగేమన్నా భ్రమపడుతున్నానా" అంటూ ఆశ్చర్యంగా కళ్ళు నులుముకొని పరీక్షగా చూసి వాని చేయి పట్టుకొని "రేయ్ చెప్పురా... ఏమైంది. అసలు ఎందుకు మానేసినావు. ఖచ్చితంగా ఏదో జరగరానిది జరిగింటాదని నా మనసు చెబుతా వుంది ఏమైంది" అన్నాడు.

సతీష్ తల వంచుకున్నాడు. కళ్ళు నేలచూపులు చూస్తున్నాయి. ముఖం ఎరుపెక్కుతూ వుంది. పెదాలు అదురుతూ వున్నాయి. చెప్పడం మొదలుపెట్టినాడు.

ఆ రోజు ఇంట్లో ఎవరూ లేరు. నేనూ, అమ్మానాన్న అంతే... నా పెళ్ళాం బిడ్డలు వాళ్ళ బంధువుల పెళ్ళికని నంద్యాల దగ్గర మహానందికి పోయినారు. వాళ్ళతో బాటే మా అక్క తమ్ముడు కూడా. ఆరోజు రాత్రి పదకొండుగంటలకు నాన్న టీవీ చూస్తా చూస్తా హఠాత్తుగా గుండె పట్టుకొని అట్లాగే కుర్చీలోంచి కింద పడిపోయినాడు. నేను అప్పటికే పైన నా గదిలో ఫుల్లుగా తాగి మత్తులో జోగుతున్నా, అమ్మ వురుక్కుంటూ పైకి వచ్చి "రేయ్... లెగ్రయా... తొందరగా లేసి ఆటో పిల్చుకోని రాపో ... నాన్నకేమైందో అర్థం కావడం లేదు" అంటూ నన్ను కుదుపుతూ గట్టిగా అరవసాగింది. ఆ మత్తులో నాకేం సరిగా అర్థం కాలేదు. బైటకొచ్చి నడవడం చేతగాక తూలుతా పోయి వీధి చివర అంగడి ముందున్న అరుగుపై పడి అట్లాగే నిద్రపోయినా, అమ్మ నేను ఆటో పిలుచుకొని వస్తానని నాన్న పక్కన కూచోని అట్లాగే ఎదురుచూస్తా వుంది. ఐదు నిమిషాలె, పదినిమిషాలు, అరగంట, గంట ... ఏమింకా వీడు రాలేదనుకుంటూ అమ్మ అంతరాత్రి వీధి చివరివరకు పరుగెత్తుకొని వస్తే అంగడి ముందు అరుగు మీద నేను వీధికుక్కలతో కలసి... ఆ అర్ధరాత్రి అమ్మ వీధిలో అరుస్తూ, ఏడుస్తూ ఇంటింటి తలుపూ కొడితే... ఆఖరికి కొందరు లేచి వురుకులు పరుగుల మీద ఆస్పత్రికి తీసుకొని పోయినారు కానీ... నాన్న అప్పటికే ...

సతీష్ గొంతు బొంగురు పోయింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి. దు:ఖాన్ని ఆపుకుంటూ "ఒక్క అరగంట ముందు తెచ్చింటే మనిషి దక్కేటోడు అన్నాడట డాక్టర్. అంతా నా వల్లే ... చేతులారా నాన్నను చంపుకున్నాను. నాకు తెలివొచ్చేసరికే ఇంటి ముందంతా బంధువులు, స్నేహితులు, మధ్యలో నాన్న శవం... అంత్యక్రియలకు సిద్ధమవుతూ. జరిగినదంతా నెమ్మదిగా అర్థమైంది. కళ్ళనీళ్ళతో నాన్న శవం ముందుకు వచ్చినా. నన్ను చూసేసరికి మా అమ్మ దు:ఖం కట్టలు తెంచుకొనింది. ఆవేశంతో వూగిపోతూ "రేయ్... నువ్వేరా...నువ్వేరా మీ నాన్నను చంపింది. ఇంగ నీ మొగం నాకెప్పుడు చూపించొద్దు ... నువ్వు గనుక మీ నాన్న చితికి నిప్పంటిస్తే శ్మశానం నుంచి ఇంటికొచ్చేసరికి నా శవం చూస్తావు. పో ఇక్కన్నుంచి ... పోయి ఆ బార్లోనే పడి అక్కన్నే

సావు" అంటూ శాపనార్థాలు పెడుతూ మీదపడి కొట్టింది. బంధువులంతా నన్ను అక్కన్నించి తీసుకోని పోయినారు.

చివరకు మా తమ్ముడే చితికి నిప్పంటించినాడు. పెద్దకొడుకునై వుండి గూడా తలకొరివి పెట్టలేకపోయినా, అప్పుడనుకున్నా మందు తాగడం మానెయ్యాలని. కానీ అది అంత సులభం కాలేదు. తాగే స్నేహితుల్ని దాదాపు వదిలేసినా. బైట తిరగడం తగ్గించేసినా ... పెళ్ళాం బిడ్డల్తోనే ఎక్కువగా గడపడం మొదలుపెట్టినా... కానీ మనసు అటువైపే లాగేది. ఎప్పుడూ అవే ఆలోచనలు, కలలు ... పిచ్చివాని మాదిరి ఐపోయేవాన్ని, తట్టుకోలేక అప్పుడప్పుడు పోయి తెచ్చేసుకునేవాన్ని. అంతవరకు నా కంట్రోల్‌లో నేనున్నాననే అతినమ్మకం ఒకటుండేది. నాలోన అది పోయింది. మందుకు శరీరం పూర్తిగా అడిక్ట్ అయిందని తెలిసిపోయింది. కానీ మానెయ్యాలని ఖచ్చితంగా నిర్ణయం తీసుకున్నా. అందర్నీ సలహాలు అడిగి ఆఖరికి బెంగుళూర్లో మూడునెలల పాటు ఒక రీహాబిలిటేషన్ సెంటర్లో చేరా. వాళ్ళిచ్చిన సలహాలు, సూచనలు పాటిస్తూ ఆఖరికి అందులోంచి పూర్తిగా బైటపన్నా. ఇప్పటికి దాదాపు ఐదు సమ్మచ్చరాలవుతోంది దాని వంక కన్నెత్తి గూడా చూడక. ఇప్పటికీ నుదుటన బొట్టు లేని అమ్మ మొగం చూసినప్పుడల్లా చేసిన తప్పు గుర్తుకొచ్చి సిగ్గుతో చచ్చిపోతుంటా అన్నాడు సతీష్ కళ్ళలోంచి సన్నగా కారుతున్న నీటిని కర్చీఫ్‌తో తుడుచుకుంటా.

సతీష్ కాసేపటికి తేరుకున్నాడు. తాగుతున్న కాఫీగ్లాసు పక్కనపెట్టి "రేయ్ ... నా స్నేహితునిగా నీ మంచి కోరి చెబుతున్నా. మానేయ్. నీ కోసం కాకపోయినా నిన్ను ప్రేమించే వాళ్ళకోసం ... నీ చుట్టూ నిన్నే నమ్ముకొని బతుకుతున్న నీ వాళ్ళకోసం" అంటూ జేబులోంచి ఒక విజిటింగ్ కార్డు తీసి సుధీర్ జేబులో పెడుతూ "ఇది నేను ట్రీట్‌మెంటు తీసుకున్న ఆసుపత్రి చిరునామా. నీలాంటి మిత్రుల కోసం ఎప్పుడూ ఒకటి జేబులోనే పెట్టుకొని వుంటా. ఆలోచించు పనికొస్తాది" అంటూ బిల్లు కట్టి వెళ్ళిపోయినాడు.

సుధీర్ మనసంతా గందరగోళంగా వుంది. కాసేపటికి ముందు తాగిన క్వార్టర్ మత్తు శరీరాన్నంతా ఆక్రమిస్తోంది. తల విదిలిస్తూ లేచి బైటికొచ్చినాడు. కాళ్ళు కొద్దిగా తడబడుతున్నాయి. కళ్ళ ముందు మళ్ళా మాటిమాటికీ కొడుకు



రూపమే కనబడుతోంది. రేప్పొద్దున వాడు గూడా నాలాగే... ఆ వూహ తలచుకొంటే చాలు ఒళ్ళు జలదరిస్తోంది.

దూరంగా ఎదురుగా సుకన్య వస్తూ కనబడింది. తనాఫీసులోనే పని చేస్తోంది. ఎక్కడ కనబడినా, ఎప్పుడు కనబడినా ఏదో గొణుక్కుంటూ అసహ్యంగా పురుగును చూసినట్టు చూస్తూ పక్కకు తప్పుకొని వెళతాది, సుధీర్‌కి సుకన్య భర్త సుందర్ గుర్తుకొచ్చినాడు. నాలుగు సంవత్సరాల క్రితం ఒకరోజు బాగా తాగి స్కూటర్ నడుపుతూ చెన్నమ్మ సర్కిల్లో ఎదురుగా వస్తున్న లారీని చూసుకోక సక్కగా పోయి గుద్దుకొని అక్కడికక్కడే చచ్చిపోయినాడు. దాంతో హాయిగా మొగుని చాటున, ఇంటిపట్టున గుట్టుగా బతికిన సుకన్య, పెద్దగా చదువుకోకపోవడంతో, భర్త పనిచేసిన ఆఫీసులోనే స్వీపర్‌గా చేరాల్సి వచ్చింది. అవమానాలను, హేళనలను, వేటాడే చూపులను తట్టుకుంటూ, పిల్లల భవిష్యత్తు కోసం పోరాడుతోంది.

సుందర్ గుర్తుకొచ్చి సుధీర్ మనసు మరింత కలవరపాటుకు లోనయ్యింది. రేపు నాకేమన్నా అయితే, నా పెళ్ళాం కూడా సుకన్యలాగే.. ఆలోచనల్తో తల తిరిగిపోతోంది.

అంగి జేబులో స్నేహితుడిచ్చిన విజిటింగ్ కార్డు నేనున్నానంటూ భరోసానిస్తోంది. సతీష్ మాటలు పదే పదే గుర్తుకు రాసాగినాయి.

నిజమే... ఇప్పటికే చానా ఆలస్యమైపోయింది. నిర్ణయం తీసుకోవాలి. ఖచ్చితంగా .... బైటపడడం కోసం అనుకున్నాడు.

ప్యాంటు జేబులోని క్వార్టర్ బాటిల్ చేతికి తగులుతోంది ... పైకి తీసినాడు.

ఇదే చివరిది.

కాదు కాదు ఇదే చివరిరోజు.

ఈ రోజంతా ఫుల్లుగా తాగి రేపటి నుంచి మొత్తం మానేయాలి అనుకుంటూ మూత తీయబోయినాడు. చుట్టూ ఏవో నవ్వులు.

భార్యా, పిల్లలు, బంధువులు, స్నేహితులు, కొలీగ్స్ ... అందరూ వెటకారంగా ... పగలబడి నవ్వుతూ ... అంతలో ఎవరో " థూ ..." అంటూ మొగమ్మీద కాండ్రించి వుమ్మేసినట్లనిపించి వులిక్కిపడినాడు.

❋

# కొరియన్ భాషా రచనకు మాన్ బూకర్

- వేలూరి కృష్ణమూర్తి
9448977877



అనువాదకురాలు డెబోరా స్మిత్‌తో హాన్ కాంగ్

ప్రతి సంవత్సరం లండన్‌లోని మాన్ బూకర్ సంస్థ ఆంగ్లభాషలో కాల్పనిక రచనలకు బహుమతులు ప్రకటిస్తుంది. ప్రతి సంవత్సరం యిచ్చే మాన్ బూకర్ బహుమతితో బాటుగా ప్రతి రెండు సంవత్సరాల కొకమారు ఈ సంస్థ అంతర్జాతీయ స్థాయిలో 'మాన్ బూకర్ ఇంటర్‌నేషనల్' బహుమతిని అందజేస్తుంది. 2016 సంవత్సరానికిగాను కొరియన్ భాషలో రచింపబడి 2007లో ప్రకటింపబడిన దక్షిణ కొరియాకు చెందిన రచయిత్రి హాన్‌కాంగ్ రచించిన నవలకు 'మాన్ బూకర్ ఇంటర్‌నేషనల్' బహుమతిని ప్రకటించింది. డోబోరా స్మిత్ అన్న రచయిత్రి 'కొరియన్ భాషను నేర్చుకొని హాన్‌కాంగ్ నవలను' దివెజిటేరియన్' అన్న పేరుతో ఇంగ్లీషులోకి అనువదించింది. ఒక కొరియన్ భాషా రచనకు మాన్ బూకర్ బహుమతి లభించడం ఇదే మొదటిసారి. అనువాద ప్రక్రియను కూడ ఒక సృజనప్రకియగా గుర్తించిన మాన్ బూకర్ సంస్థ అనువాదకురాలు డెబోరాస్మిత్‌కు కూడా మాన్ బూకర్ బహుమతిని ఇస్తున్నది.

పురుష ప్రధానమైన అన్ని సమాజాలలోనూ, ఎన్ని కట్టుబాట్లు వున్నప్పటికీ వాటిని ఎదురించి నిలబడ్డ మహిళను పురుషులెలా అదిమిపెట్టి వుంచుతారన్నది 'ది వెజిటేరియన్' నవలలోని ఇతివృత్తం. రచయిత్రి హాన్‌కాంగ్ 1970, నవంబరు 17న దక్షిణ కొరియా దేశంలోని గ్వాంగ్జులో జన్మించినది. ఆమె తండ్రి సియంగ్‌వన్ కూడా రచయిత. దీనికి తోడు ఆమె అన్నగారు కూడా రచయితే. చిన్నప్పటి నుండి సాహిత్య సంబంధమైన వాతావరణంలో పెరిగినందువల్ల, ఆమె తండ్రి, 0అన్నగార్ల రచనా ప్రభావం హాన్‌కాంగ్‌పై పడడంలో ఆశ్చర్యం లేదు. అలాంటి పరిసరాలలో పెరిగిన హాన్‌కాంగ్‌కు, తాను కూడా ఒక గొప్ప రచయిత్రి కావాలన్న కోరిక చిన్నప్పటి నుండే ఉద్భవించినది. దాని పరిణామమే హాన్‌కాంగ్ ఉన్నత పాఠశాల చదువైన వెంటనే యాన్సేయి విశ్వవిద్యాలయంలో సాహిత్య పరమైన ఉన్నత చదువు సాగించి, సాహిత్యన్నే తన వృత్తిగా మార్చుకుంది. పురుషాధిక్యత ఎక్కువగా ఉన్న దక్షిణ కొరియా సమాజంలో జీవిస్తూ అక్కడి మహిళలు అనుభవిస్తున్న అసమానతను గమనించిన రచయిత్రి ఆ అంశాలనే తన రచనలలో ఇతివృత్తంగా తీసుకుంది. ప్రస్తుత పరిస్థితిలో స్త్రీ తన అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి ఎంతగా ప్రయత్నిస్తున్నా, పురుష ప్రధానమైన ఈ సమాజాలు ఎన్నో అడ్డంకులు, అవాంతరాలను సృష్టిస్తున్నవి. అలా సమానతకై ప్రయత్నించినపుడు మహిళ ఎలాంటి ఒడిదుడుకులను, అడ్డంకులను ఎదుర్కోవాల్సి ఉంటుందన్న విషయాన్ని హాన్‌కాంగ్ తన నవల 'ది వెజిటేరియన్'లో హృదయానికి హత్తుకొనే లాగా చిత్రించింది.

'ది వెజిటేరియన్' నవల కథానాయకి యోగ్‌హె ఇంటి పనులు చేసుకుంటూ, పుస్తకాలు చదువుకోవటం, గృహిణిగా వున్న తనకు అలవాటు. కుటుంబంలోని స్త్రీకి, తనదైన స్వాతంత్రం వుండాలి. ఈ సమాజంలో పురుషుడు, స్త్రీ సమానులుగా ఉండాలన్న కోరిక వున్నటువంటి స్త్రీ. తన మాటలకు భార్య తల ఊపాలనే పట్టుదల ఉన్న మనస్తత్వం కల పురుషుడు ఆమె భర్త. యోగ్‌హెకు మాంసాహారం త్యజించి శాఖాహారి కావాలన్న మహత్వాకాంక్ష. తన ఈ కోరికను భర్తకు తెలుపుతుంది. కాని, ఆమె భర్త అంగీకరించడు. దీనితో వారిరువురి మధ్య వైమనస్యం మరింత ప్రబలమవుతుంది. యోగ్‌హె శాఖాహారి కావడానికి ప్రయత్నిస్తున్నదని తెలిసిన ఆమె తండ్రి కూడా ఆమెను మాంసాహారం భుజించమని తన కూతురిపై ఒత్తిడి చేస్తాడు. కాని ఆమె మాత్రం సుతరామూ అంగీకరించదు. చివరకు యోగ్‌హెకు పిచ్చిపట్టినదన్న నిర్ణయానికి వచ్చిన వారి కుటుంబం, ఆమెను పిచ్చాసుపత్రికి చేర్చుతారు. ఇలా ముగుస్తుంది 'ది వెజిటేరియన్' నవల.

రచయిత్రి హాన్‌కాంగ్ నవలలతో పాటు కవితలు, వ్యాసాలు, కథలు కూడ రాశారు. ఈ సంవత్సరం హాన్‌కాంగ్‌కు మాన్ బూకర్ ఇంటర్‌నేషనల్ పురస్కారం లభించడం కొరియన్ సాహిత్య క్షేత్రంలో, ఆమె రచనా జీవితంలో ఒక గొప్ప మైలురాయి.

❋



## బెంగాలీ కవి శంఖాఘోష్‌కు జ్ఞానపీఠ పురస్కారం

ప్రసిద్ధ బెంగాలీ రచయిత శంఖాఘోష్‌కు 2016 సంవత్సరానికి జ్ఞానపీఠ పురస్కారం లభించింది. శంఖాఘోష్ 1932 సంవత్సరం ఫిబ్రవరి 6 న ఇప్పటి బంగ్లాదేశ్‌లోని చాంద్‌పూర్ అనే గ్రామంలో జన్మించారు. తన విద్యాభ్యాసం అంతా కలకత్తాలో సాగింది. కలకత్తాలో వివిధ విద్యా సంస్థలలో పనిచేశారు. 1992లో జాద్‌వ్‌పూర్ విశ్వవిద్యాలయం నుండి పదవీ విరమణ పొందారు. బెంగాలీ సాహిత్య క్షేత్రంలో కవిగా, విమర్శకుడుగా ప్రాచుర్యం పొందారు. రవీంద్రనాథ్ టాగూర్ సాహిత్యంపై సాధికార విమర్శకుడుగా శంఖాఘోష్‌ను పేర్కొంటారు. బెంగాలీ ఆధునిక కవిత్వంలో భిన్నమైన శైలితో ప్రత్యేకత కనబర్చారు. బెంగాలీ సమకాలీన కవితా ధోరణిని ప్రభావితం చేసిన కవిగా శంఖాఘోష్ పేరు తెచ్చుకున్నారు. 60 కవితా సంపుటాలను ప్రచురించిన శంఖాఘోష్ పలు విమర్శ గ్రంథాలు కూడా వెలువరించారు. పలు భారతీయ భాషలలోకి కూడా వీరి రచనలు అనువాదమయ్యాయి. ప్రసిద్ధ కవి గుర్రం జాషువా కుమార్తె హేమలతా లవణం స్థాపించిన జాషువా ఫౌండేషన్ సంస్థ లక్ష రూపాయల నగదు పురస్కారాన్ని కూడా శంఖాఘోష్ అందుకున్నారు. 1977లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, 2011లో పద్మభూషణ్ అందుకున్నారు. ❋

## కవిత



### పయనం

- లాస్యప్రియ కుప్పా
9640551664

నేను నీకు తటస్థ పడుతూనే వుంటాను
ఎప్పుడు ఎక్కడ ఎలా
ఏమో చెప్పలేను మరి
నీ తలపుల్లోకి తొంగి చూస్తూ
నీ ఊహలకి రంగులద్దుకుంటూ
నీ కళ్ళ చిత్రాల్లో
కలల సీతాకోక చిలుకలా
పచ్చని దారుల్లో గడ్డిపువ్వులా
పలకరింపుల పెదాల మధ్య
విచ్చుకునే నవ్వులా
అవ్యక్త వాంఛలతో
నింపుతూ వుంటాను
నేను నీలోకి
తొంగి చూస్తూనే వుంటాను
ఎప్పుడు ఎక్కడ
తెలియదు నాకు
తూరుపు కిరణంలా తలుపు తడతాను
తొలకరి చినుకులా తడుపుతాను
హృదయతల్పంలో
ఊయలలా ఊపుతుంటాను
నిశ్శబ్దగానాలన్నిటిని
మౌనంగా వింటూ వుంటాను
నీది కాని నీ ప్రపంచాన్ని
పరిచయించే నీ గది కిటికీనౌతాను
నేను నీతో తగువుపడుతూనే వుంటాను
ఎందుకో ఎప్పుడో ఎలాగో
తెలియదన్నాను కదా!
నీలోని విలక్షణీయతల్ని
విప్పి చూపిస్తుంటాను
నీకు నిన్నే సవాలుగా
విసిరేసే ఎదుగుదలనౌతాను
నీ జీవితనౌకని బతుకుసంద్రంలో
నడిపించే చోదకశక్తినౌతాను
కలల కావిడిని దించి
నీ ఒళ్ళో నిన్ను సేదదీర్చే వాస్తవాన్నౌతాను
నేను నీతో తలపడుతూనే వుంటాను
ఎందుకు ఎక్కడ ఎప్పుడు
తెలియటం లేదు నాకు
కాలాన్ని కట్టుకుని ప్రాణాల్ని చుట్టుకుని
కడదాకా కొనసాగుతూ వుంటాను
నీకు శాశ్వత నిద్ర వచ్చేదాకా
పిడికెడు మట్టినై పల్లవిస్తూనే వుంటాను
అత్యంత సన్నిహితంగా
ఆద్యంతం సహజంగా
ఇంతకన్నా ఏమి తెలియదు నాకు
ఎక్కడైనా
సూర్యుడు ఉదయిస్తాడు
సూర్యుడు అస్తమిస్తాడు
ఎప్పుడైనా
మనిషి జన్మిస్తాడు
మనిషే మరణిస్తాడు
❋

# పాపినేనికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు



కేంద్ర ప్రభుత్వం డిసెంబర్ 21న కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డులను ప్రకటిం చింది. రజనీగంధ కవితా సంపుటి రచించిన పాపినేని శివశంకర్‌ను ఈ అవార్డుకు ఎంపిక చేసినట్టు వెల్లడించింది. పాపినేని స్వస్థలం గుంటూరు జిల్లా తుళ్లూరు మండలం నెక్కల్లు. ఈ అవార్డును ఫిబ్రవరి 22న ప్రదానం చేయనున్నారు. సాహిత్య రంగంలో విశేష కృషి చేసిన విజయవాడకు చెందిన నాగళ్ల గురు ప్రసాద్‌కు భాషా సమ్మాన్ అవార్డు దక్కింది. కథ, కవిత, నవలా రచన, విమర్శ, వ్యాస రచన తదితర విభాగాలకు గాను మొత్తం 24 భాషల్లో 24 మందిని కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు-2016కు ఎంపిక చేసినట్లు కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి కె. శ్రీనివాసరావు వెల్లడించారు. "ఎనిమిది మంది కవులు, ఏడుగురు రచయితలు, ఐదుగురు నవలా రచయితలు, ఇద్దరు పుస్తక విమర్శకులు, ఒకరు వ్యాస రచన, ఒకరు నాటక విభాగాల్లో అవార్డులు దక్కించుకున్నారు. తెలుగు, అస్సామీ, బోడ, గుజరాతీ, మళయాలం, సంస్కృతం, సంటాలి, సింధీ భాషలకు చెందిన ఎనిమిది మంది కవులకు సాహిత్య అకాడమీ అవార్డు వరించింది. డోగ్రీ, మైథిలి, మణిపూరీ, మరాఠీ, ఒరియా, రాజస్థానీ, తమిళ భాషలలో ఏడుగురు రచయితలకు అవార్డు దక్కింది. ఇంగ్లీషు, హిందీ, కన్నడ, కొంకణి, నేపాలీ భాషల్లో ఐదుగురు నవలా రచయితలను అవార్డు వరించింది. కాశ్మీరీ, ఉర్దూ భాషల్లో పుస్తక విమర్శలకూ, బెంగాలీలో వ్యాస రచనకూ, పంజాబీలో నాటక విభాగానికి గాను అవార్డులు దక్కాయి. పుస్తక ఎంపికను ఆయా భాషల్లో ముగ్గురు సభ్యులతో కూడిన జ్యూరీ ప్రతిపాదించింది. మొత్తం 24 భారతీయ భాషల్లో ముగ్గురు సభ్యులతో కూడిన జ్యూరీలు పంపించిన ప్రతిపాదనలను కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షుడు విశ్వనాథ్ ప్రసాద్ అధ్యక్షతన జరిగిన సాహిత్య అకాడమీ ఎగ్జిక్యూటివ్ బోర్డు సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది" అని శ్రీనివాసరావు తెలిపారు. తెలుగుకు సంబంధించిన జ్యూరీలో ప్రముఖ రచయితలు డా॥ కొలకలూరి ఇనాక్, మునిపల్లె రాజు, ప్రొ॥ ఎస్.వి. రామారావుల కమిటీ ఈ ఎంపిక చేసింది. మూడేళ్ల కాల పరిమితి (1 జనవరి 2010 నుంచి 31 డిసెంబర్ 2014) లో ప్రచురించిన పుస్తకాలను మాత్రమే పరిగణలోకి తీసుకున్నారని ఆయన చెప్పారు. ఈ అవార్డు కింద రూ. లక్ష నగదు, తామ్ర పత్రం అందజేసి, శాలువాతో సత్కరించనున్నట్లు ఆయన తెలిపారు.

### పాపినేని సాహితీ ప్రస్థానం

గుంటూరు జిల్లాకు చెందిన ప్రముఖ సాహితీ విమర్శకులు, సుప్రసిద్ధ కవి డాక్టర్ పాపినేని శివశంకర్ సాహితీ ప్రస్థానంలో 350 వరకూ కవితలు, 60 వరకూ కథలు రాసి సాహితీ వేత్తల ప్రశంసలు అందుకున్నారు. ఇప్పటి వరకూ పలు అవార్డులు అందుకున్న పాపినేని తెలుగు అధ్యాపకులు. 1953 నవంబరు 6న నెక్కల్లులో జన్మించిన ఆయన ఎస్ఎస్ఎల్‌సి వరకూ తుళ్లూరు జెడ్‌పి స్కూలులో చదివారు. తరువాత ఎసి కళాశాలలో బిఏ పూర్తి చేశారు. 1976లో ఆంధ్రా యూనివర్సిటీ నుంచి ఎంఏ పట్టాను అందుకున్నారు. తరువాత పిహెచ్‌డి చేశారు. తాడికొండ బిఎస్‌సిబి కళాశాలలో తెలుగు అధ్యాపకునిగా తన ప్రస్థానాన్ని ప్రారంభించారు. దాదాపు 30 ఏళ్లపాటు అధ్యాపకునిగా పనిచేసిన ఆయన గత 35 ఏళ్ల కాలంలో ఎన్నో పుస్తకాలు రాశారు.

ప్రపంచంలో విచ్ఛిన్నమవుతున్న మానవసంబంధాలు, విలువలపై డాక్టర్ శివశంకర్ రాసిన 'రజనీ గంధ' కవితా సంపుటి గాను కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. శివ శంకర్‌రాసిన కవితా సంపుటిలలో రజనీగంధ ఐదోది. దేశ విదేశాల్లో పర్యటనల సందర్భంగా తనకు ఎదురైన అనుభూతుల ఆధారంగా ఈ సంపుటిని రాశారు. ఇందులో కొంత మంది విలక్షణమైన వ్యక్తుల గురించి కూడా వివరించారు. సాహిత్య అకాడమీ అవార్డుకు ఎన్నికైన సందర్భంగా ఆయన విలేకరులతో మాట్లాడారు. తాను రాసిన అన్వేషణ కవితా సంపుటి తనకు ఎంతో ఇష్టమని తెలిపారు.

దేశంలో ఎంతో అత్యుత్తమైన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రావడం తనకెంతో సంతోషంగా ఉందన్నారు. గొప్ప అన్వేషణ ద్వారా రచనలు పుడతాయని చెప్పారు. కథావస్తువు ఏదైనా గొప్పగా మలచగలగడమే కవి గొప్పతనమని పేర్కొన్నారు. రచయితలు సమాజాన్ని మేల్కొల్పడమే లక్ష్యంగా పెట్టుకోవాలన్నారు. వర్ధమాన రచయితలు అధ్యయనం ద్వారానే రచనలు చేయాలని అయన సూచించారు. తనకు వృత్తి, ప్రవృత్తి రచనలే కనుక అనతి కాలంలో సాహిత్యంపై పట్టు లభించిందని తెలిపారు. సాహిత్య రంగానికి ప్రభుత్వం తగిన ప్రాధాన్యత ఇవ్వాలన్నారు. మూడున్నర దశాబ్దాలుగా రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నానని శివశంకర్ తెలిపారు.

**నాగళ్ళ గురుప్రసాద్‌కు 'భాషా సమ్మాన్' అవార్డు**

ప్రముఖ రచయిత, సాహితీవేత్త నాగళ్ళ గురుప్రసాద్‌కు కేంద్ర సాహిత్య అకాడమీ 'భాషా సమ్మాన్' అవార్డును ప్రకటించింది. తెలుగు భాషాభ్యున్నతికి కృషి చేసినందుకు గాను ఆయనకు ఈ అవార్డు లభించింది. గుంటూరు జిల్లా కావూరు గ్రామానికి చెందిన నాగళ్ళ గురుప్రసాద్ 1956లో విజయవాడలోని ఆంధ్రా లయోలా కళాశాలలో తెలుగు ఉపాధ్యాయుడుగా తన ప్రస్థానం ప్రారంభించారు. 1975లో సిద్ధార్థ అకాడమీలో భాగమైన పర్వతనేని బ్రహ్మయ్య సిద్ధార్థ కళాశాలలో తెలుగు ఉపాధ్యాయుడిగా చేరి తెలుగు శాఖాధిపతిగా పనిచేశారు. 1989-90లో అదే కళాశాలకు ప్రిన్సిపాల్‌గా బాధ్యతలు చేపట్టారు. ఉద్యోగ విరమణ అనంతరం సిద్ధార్థ కళాపీఠానికి 1991 నుండి 2011 వరకు ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. ఈ సమయంలో అనేక సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు తనదైన శైలిలో నిర్వహించారు. అనంతరం కేంద్ర సాహిత్య అకాడమీ ప్యానల్‌లో ఉన్నారు. నాగళ్ళ వందకు పైగా వ్యాసాలు, 300 వరకు సమీక్షలు చేసారు. తెలుగు భాషపై పట్టు, తెలుగు భాష అభివృద్ధికి చేసిన కృషికి గాను 2003లో తెలుగు అసోసియేషన్ నార్త్ అమెరికా పురస్కారం అందజేసింది. 2006లో అమెరికా తెలుగు అసోసియేషన్ వారు సత్కరించారు.

❋

## కవిత

# మంకెన పువ్వు

- నన్నపనేని రవి
9963671531




పూరిపాక కింద పుట్టడం శాపమయ్యింది
ఉరుకులూ పరుగులూ
ఉయ్యాలలూగే వయసులోనే ఊపిరాగిపోయింది
ఒక తెలివైన భవిష్యత్తుని వర్తమానం కోల్పోయింది
మా కనుపాపల మీద
తన రూపం కదిలాడుతూనే ఉంది
చిరునవ్వుతో ఎదురవ్వడం
మోపెడు పుస్తకాలు మోస్తూ కూడా
చకచకా నడవడం
మాట్లాడుతున్నంతసేపు మోరుపు చూపుల్తో గమనించడం
తెలిసింది బిగ్గరగా చెప్పడం
తెలుగులో వందకి వంద ఎందుకేయరనడం
అలగడం - అంతలోనే గలగలమనడం
ఆట స్థలంలో
మగ పిల్లల్తో పోటీపడడం.. గెలవడం
పిల్లలందరికీ ప్రియమైపోవడం...
మృత్యువుకి నచ్చలేదో కాలానికి కన్నుగుట్టిందో
దేహం ధిక్కరించలేకపోయింది
ముదిరిన వ్యాధిని పేదరికం జయించలేకపోయింది
ఖరీదైన వైద్యం కనికరించలేకపోయింది
మంకెన పువ్వు రాలిపోయింది
మేం
సీరియస్‌గా పాఠం చెబుతున్నప్పుడు
తాను కూర్చున్న చోటు
ఏకాగ్రత కోల్పోని ప్రదేశమై మా వైపు చూస్తూనే ఉంది
పొద్దున్నే
మా కంటే ముందు బడికి వస్తున్నట్లే ఉంది

*(మానస స్మృతిలో-)*

❋

## స్వీకారం

### వెన్ను విరిగిన కంకులు



రైతు కవిత్వం

డా॥ మక్కెన శ్రీను

వెల : 60/- పేజీలు: 50

ప్రతులకు : 9885219712

ఈ పుస్తకంలో రైతుల జీవితాలను అన్ని కోణాలలో స్థూలంగా మరియు సరళంగా స్పృశించారు. ప్రపంచీకరణ, సెజ్‌లు, అభివృద్ధి నేపథ్యంలో వేలాది ఎకరాల పచ్చని పంటపొలాలు, అంగుళాలు, అడుగులుగా రియల్ ఎస్టేట్ వెంచర్ల రూపంలో ఎలా మారిపోతున్నాయో రచయిత తన కవిత్వంలో హృద్యంగా వర్ణించారు.

– డా॥పి.వి.కె. శశిధర్

### లంబా హై సఫర్



సాహితీ స్వర్ణోత్సవం

డా॥ దిలావర్ సమగ్ర కవిత్వం

వెల : 100/- పేజీలు: 232

ప్రతులకు : 9866923294

దిలావర్‌గారి కవిత్వం నిజంగా 'తిరిగొచ్చిన పజ్జెం' కాని విలువల్ని శాసిస్తున్నామనుకునే నకిలీ నిర్ణేతల చూపుల ఎన్‌కౌంటర్‌లో గుండెలు తూట్లు పడిన తిరస్కృతి పజ్జెం కాదిది. నకిలీ విలువల గుండెలు తూట్లు పొడిచి ఆ తీరులన్నిటిని తిరస్కరించిన తిరుగుబాటు పజ్జెం ఇది. బురఖా ఛందస్సుని నిరాకరించి, భావంలేని వుత్త నఖాబ్ కింద అరిగిపోయిన 'ప్యార్‌కా నగ్మా'ని గిరాటేసిన ఫ్రీవర్స్ ఇది.

– అఫ్సర్

### కళింగ నానీలు



డా॥ చింతకింది శ్రీనివాసరావు

వెల : 60/- పేజీలు: 63

ప్రతులకు : 8897147067

సాంద్రత, ఆర్ద్రత, కవితాత్మకత, నిర్మాణనిపుణత నాలుగు పేటలుగా అల్లుకపోయిన ఊపిరిహారమితని నానీ కవిత్వం. ఒక కవీ, కాల్పనికకారుడు, విమర్శకుడు, పాత్రికేయుడు వెరసి ఒక సంవేదనాశీలి హృదయం నుండి రాలిపడిన భావమౌక్తికాలీ నానీలు.

– డా॥ ఎన్. గోపి

### పరాగభూమి కథలు



కలువకొలను సదానంద

వెల : 150/- పేజీలు: 220

ప్రతులకు : 9440995010

సదానంద గారిది అందమైన చేతిరాత. అందమైన శైలి. వినసొంపైన కంఠం. ఒక శిల్పిలా, ఒక చరిత్రకారుడిలా, ఒక సామాజిక శాస్త్రవేత్తలా, ఒక తాత్వికుడిలా, ఒక జీవన పోరాట యోధుడిలా, ఒక దుఃఖితుడిగా ఆయన జీవితాన్ని, సమాజాన్ని అన్ని కోణాల్లో నుంచి పరిశీలించిన తీరు అబ్బురమనిపిస్తుంది.

– పలమనేరు బాలాజీ

### చంద్రుడు గియ్యని బొమ్మలు



(సాహితీ స్వర్ణోత్సవం సందర్భంగా)

డా॥ దిలావర్ కథలు

వెల : 100/- పేజీలు: 198

ప్రతులకు : 9866923294

గుండెను తడి చేసుకొని దిలావర్ తనకథల్ని రాసిండు. కండ్లల్ల నీళ్ళు నింపు కొని చదువు కునేలా రాసిండు. చావులు, ఆత్మహత్యలు–ఏదిరాసినా వాళ్ళ దుఃఖాన్ని ఫీలయ్యి రాసిండు. అంతిమంగా ఇందులోని ఒకటి రెండు మినహా అన్ని కథలూ కింది కులాల వారి ఫెయిల్యూర్ స్టోరీలను చెప్పాయి.

– సంగిశెట్టి శ్రీనివాస్

### క్షణ వీక్షణాలు




(100 ఒక పేజీ కథలు)

పాలపర్తి ధనరాజ్

వెల : 100/- పేజీలు: 100

ప్రతులకు : 9550593901

అల్పాక్షరాల్లో అనల్పభావాన్ని అందిస్తూ పాఠకుల హృదయాల్లోకి తీసుకొని వెళ్ళడం ముఖ్యమైన అంశం. ఆ విషయంలో ధనరాజ్ మాస్టారు కృత కృత్యులయ్యారు. ఈ క్షణ వీక్షణాల్లో ఇది ధనరాజ్‌గారి ద్వితీయ కథా సంకలనం. అద్వితీయమైన భావాలకు ఆలంబనం.

– డా॥ తలారి వాసు




# రాజమహేంద్రవరంలో కుసుమ ధర్మన్న సమాలోచన

'**మా**కొద్దీ నల్లదొరతనం' అంటూ పెత్తందార్లపై అక్షరాగ్ని కురిపించిన కుసుమ ధర్మన్న రచనలు, సాహిత్యంపై పూర్తిస్థాయిలో పరిశోధనలు జరగాలని కుసుమ ధర్మన్న సాహితీ సమాలోచన సదస్సులో ఉభయ గోదావరి జిల్లాలకు చెందిన సాహిత్యాభిమానులు, సామాజిక కార్యకర్తలు, కవులు, రచయితలు, పరిశోధకులు, కళాకారులు, మేధావులు, దళిత, ప్రజాసంఘాల నాయకులు విజ్ఞప్తి చేశారు. 'కుసుమ ధర్మన్న సాహితీ సమాలోచన' ఆహ్వాన సంఘం ఆధ్వర్యంలో రాజమహేంద్రవరంలోని బొమ్మన రామచంద్రరావు ఛాంబర్ ఆఫ్ కామర్స్ ట్రస్ట్ హాలులో సెప్టెంబర్ 18న పూర్తిరోజు సదస్సు జరిగింది. ప్రారంభ సభకు అధ్యక్షత వహించిన కుసుమ ధర్మన్న సాహితీ సమాలోచన ఆహ్వాన సంఘం అధ్యక్షుడు ఇ.విజయపాల్ మాట్లాడుతూ కవులు, రచయితలు, పరిశోధకులు, మేధావులతో చర్చించి కుసుమ ధర్మన్న సాహితీ పీఠం ఏర్పాటుపై ప్రభుత్వాన్ని కోరతామని తెలిపారు.

ఈ సందర్భంగా ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన కుసుమ ధర్మన్న రచనలు 'మాకొద్దీ నల్లదొరతనం', 'హరిజన శతకం', 'సామ్యవాదాన్ని సహించని హిందూయిజం', 'మద్యపాన నిషేదం' 'తొలి దలిత స్ఫూర్తి కుసుమ ధర్మన్న(వ్యాసాలు)' 'కుసుమ ధర్మన్న రచనలు-దళిత దృక్పథం' (డాక్టర్ మద్దూకూరి సత్యనారాయణ),' కుసుమ ధర్మన్న జీవిత ప్రస్థానం' (డాక్టర్ పుట్ల హేమలత) పుస్తకాలను అతిథులు ఆవిష్కరించారు. ప్రారంభ సభలో భద్రాచలం మాజీ ఎంపీ డాక్టర్ మిడియం బాబూరావు మాట్లాడుతూ తెల్లదొరల పాలన అంతమైనప్పటికీ, నల్లదొరల పాలనలోనూ అవే లక్షణాలు కన్పిస్తున్నాయని స్పష్టం చేశారు. మనుధర్మ శాస్త్రానికి సమాధానం కుసుమ ధర్మన్న శాస్త్రమేనని ఉత్తరాంధ్ర జిల్లాల ఎంఎల్‌సి ఎంవిఎస్.శర్మ అన్నారు. ఉభయగోదావరి జిల్లాల ఉపాధ్యాయ ఎంఎల్‌సి రాము సూర్యారావు మాట్లాడుతూ దళితుల విద్యాభివృద్ధి కోసం దళిత సంఘాలు కృషి చేయాలన్నారు. మాజీ ఎంపీ డివిజి.శంకరరావు మాట్లాడుతూ కుసుమ ధర్మన్న సాహిత్యాన్ని, రచనలను అందరికీ అందించాలన్నారు.

'కుసుమ ధర్మన్న-సామాజిక సాహిత్య నేపథ్యం' అనే అంశంపై జరిగిన తొలి సదస్సుకు సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. ఆదికవి పుట్టిన చోటే ఆది ఆంధ్ర కవి పుట్టాడన్నారు. గోదావరి పుష్కరాలు ముగిశాయి. ధర్మన్న పుష్కరాలు ప్రారంభమయ్యాయంటూ ఆయన చమత్కరించినప్పుడు సభ స్పందించింది. ఈ సదస్సులో ఎండ్లూరి సుధాకర్, శిఖామణి, సన్నిధానం నరసింహశర్మ, జివి.రత్నాకర్, వేముల ఎల్లయ్య, శ్యాంషా, మద్దుకూరి సత్యనారాయణ, వేముల ఎల్లయ్య ప్రసంగించారు. అనంతరం జరిగిన "దళితులు-వర్తమానం-కుసుమ ధర్మన్న' అంశంపై జరిగిన సదస్సుకు కళాసమితి అధ్యక్షులు జి.సుబ్బారావు అధ్యక్షత వహించారు. ఈ సదస్సులో మేడిపల్లి రవికుమార్, కె.ఆశాజ్యోతి, పుట్ల హేమలత, కె.గౌరేశ్వరరావు, కోయి కోటేశ్వరరావు, టి.సత్యనారాయణ, గూటం స్వామి ప్రసంగించారు. ఈ సభలో కుసుమ ధర్మన్న మనుమరాలు రాజకుమారి, మనుమడు ప్రసాద్, కోడలు అమ్మాజీ, ధర్మన్న సహచరుడు, మాజీ ఎంఎల్ఎ చిట్టూరి ప్రభాకర చౌదరి, సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వొరప్రసాద్ ప్రజాశక్తి బుక్‌హౌస్ జనరల్ మేనేజర్ లక్ష్మయ్య, కెవిపిఎస్ జిల్లా ప్రధాన కార్యదర్శి జె. రూపస్‌రావు, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్, రాష్ట్ర మానవ హక్కుల సంఘం అధ్యక్షుడు ముప్పాళ్ల సుబ్బారావు, ప్రజాసంఘం నాయకులు అరుణ్, జెవివి రాష్ట్ర అధ్యక్షుడు చల్లా రవికుమార్ తదితరులు పాల్గొన్నారు.

కుసుమ ధర్మన్న సాహితీ సమాలోచన సదస్సు నేపథ్యంలో నిఖిలం సురేష్ నిర్వహణలో ప్రజానాట్యమండలి కళాకారులు కుసుమ ధర్మన్న జీవితం, సాహిత్యంపై నిర్వహించిన నృత్యరూపకాలు, గేయాలు పలువురిని ఆకట్టుకున్నాయి. ధర్మన్న రాసిన 'మాకొద్దీ నల్లదొరతనము' గేయంపై ప్రదర్శించిన కళారూపం ప్రేక్షకులను ఆలోచింపజేసింది. ఉభయ గోదావరి జిల్లాల నుండే కాక, రెండు తెలుగు రాష్ట్రాల నుండి పెద్దయెత్తున సాహిత్యాభిమానులు ఈ సభకు వచ్చారు. ❋

## సామాజిక చేతన హేల - కవనజ్వాల



*శ్రీకాకుళంలో నవంబర్ 13న జరిగిన 'కవన జ్వాల' ఆవిష్కరణ. చిత్రంలో డిఆర్‌కె నాయుడు, వొర్రప్రసాద్, గంటేడ గౌరునాయుడు, నల్లి ధర్మారావు, కాళీపట్నం రామారావు, చింతాడ రామారావు, పెనుగొండ లక్ష్మీనారాయణ, బి.వి.ఏ. రామారావునాయుడు, అట్టాడ అప్పలనాయుడు*

సాహితీ స్రవంతి, శ్రీకాకుళం ఆధ్వర్యంలో నవంబర్ 13న బాపూజీ కళామందిర్‌లో కథా నిలయం వ్యవస్థాపకులు కాళీపట్నం రామారావు "కవనజ్వాల" కవితా సంకలనాన్ని ఆవిష్కరించారు. తమ ఉన్నతిని చాటుకోవడంకోసమో, పెద్దల మెప్పుకోసమో ఊహాలోకాల్లో విహరిస్తూ రాయడం కాకుండా సాహిత్యాధ్యయనం, అవగాహనతో రాయాలని ఆయన సూచించారు. సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి చింతాడ రామారావు అధ్యక్ష ప్రసంగం చేస్తూ "కవుల రచనలు చైతన్యవంతంగా ఉండాలని, సమాజ పురోగతికోసం కవిత్వోద్యమం చేపట్టాల్సిన అవసరం ఉందన్నారు. మాజీ మంత్రి గుండ అప్పలసూర్యనారాయణ మాట్లాడుతూ రాజకీయాలు వ్యక్తుల నుండి కార్పొరేట్ శక్తుల చేతుల్లోకి వెళ్ళిపోతున్నాయని, అది ప్రజాస్వామ్యానికి విఘాతమని అన్నారు. ప్రముఖ రచయిత నల్లి ధర్మారావు చరిత్ర ప్రజలకోణం నుండి కాకుండా రాజుల ముఖ స్తోత్రాలుగా నమోదు కాబడిందని, వర్తమాన సమాజాన చరిత్ర ప్రజల కోణం నుండి లిఖించబడాలన్నారు. అరసం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ కవిత్వం జడ పదార్థంలా కాకుండా అభ్యుదయ పంథాలో ప్రజల్లోకి చొచ్చుకుపోయేదిలా ఉండాలన్నారు. ప్రముఖ రచయిత అట్టాడ అప్పలనాయుడు "కవనజ్వాల"ను సమీక్షిస్తూ ఏ పండగలకో, కార్యక్రమాలకో రచనలు చేయడమే కాకుండా ఒక బాధ్యతగా భావించి రచనలు చేయాలన్నారు. "సాహిత్య ప్రస్థానం" వర్కింగ్ ఎడిటర్ వొర్రప్రసాద్ మాట్లాడుతూ ప్రజల అవసరాల్ని, సమస్యల్ని శాసనకర్తలు పట్టించుకోవడంలేదని, ఆ పని అనధికార శాసనకర్తలైన రచయితలే చేస్తున్నారన్నారు. కవిత్వం ఒక సామాజిక అవసరంగా భావించినప్పుడు నిరంతర అధ్యయనం అవసరమని, సాహిత్యాన్ని సమాజహితంగా మలచడానికి చర్చ అవసరమని ప్రముఖ రచయిత గంటేడ గౌరునాయుడు అన్నారు. ప్రధాన ఆదినారాయణ రాసిన "సిక్కోలు నానీలు" పుస్తకాన్ని బి.వి.ఏ. రామారావునాయుడు ఆవిష్కరించారు. భోజన విరామం అనంతరం "కవనజ్వాల"లోని కవిత్వంపై చర్చ, విమర్శ, సమీక్ష సభ జరిగింది. సభాధ్యక్షులుగా ప్రధాన ఆదినారాయణ, నిర్వాహకులుగా దుప్పాడ రామకృష్ణనాయుడు, వ్యాఖ్యాతగా పరిమళలు వ్యవహరించారు. కె.శ్రీనివాస్, పరిమళ, తమ్మినేని సీతారామానుజాచార్యులు, గార రంగనాథం, 'సిరా', పి.యస్.నాగరాజు, బొడ్డేపల్లి కనక మహాలక్ష్మిలు విమర్శలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా సాహితీస్రవంతి శ్రీకాకుళం జిల్లా కమిటీని చింతాడ రామారావు ప్రకటించారు. సభ మధ్యలో హేమ సూదన్ నిర్వహణలో ప్రజా నాట్యమండలి కళాకారులు, విజయనగరంకు చెందిన గజల్ వినోద్ గానాల నాలపించారు.

❋

## కవనసేద్యం ఆవిష్కరణ




*కర్నూలులో డిసెంబర్ 18న జరిగిన కెంగార మోహన్ కవితా సంపుటి 'కవన సేద్యం' ఆవిష్కరణ. చిత్రంలో సాహిత్య ప్రకాష్, కెంగార మోహన్, లోసారి సుధాకర్, జంధ్యాల రఘుబాబు, కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి, జయరాం, ఉద్దండం చంద్రశేఖర్ ఉన్నారు.*

సాహితీస్రవంతి కర్నూలు జిల్లా ప్రధానకార్యదర్శి కెంగారమోహన్ రచించిన కవనసేద్యం కవితాసంపుటి ఆవిష్కరణసభ కర్నూలు నగరంలోని పింగళిసూరన తెలుగుతోటలో డిసెంబర్ 18న జరిగింది. సాహితీస్రవంతి రాష్ట్రకార్యదర్శి జంధ్యాల రఘుబాబు అధ్యక్షత వహించిన ఈ ఆవిష్కరణసభలో కవితాసంపుటిని ప్రముఖకవి, విమర్శకులు కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి ఆవిష్కరించారు. విశిష్ట అతిథిగా ప్రముఖ కవి, కడప యస్సీ,యస్టీ సెల్ డీయస్పీ లోసారి సుధాకర్, ఆత్మీయ అతిథిగా ప్రముఖ రచయిత సాహిత్యప్రకాశ్, పుస్తక సమీక్ష ప్రముఖకవి ఉద్దండం చంద్రశేఖర్ చేశారు. ఆత్మీయ సందేశాలను కవులు డా.జయరాం, జి.వెంకటకృష్ణ, నాగమణి, ఇచ్చారు. ఈ కార్యక్రమంలో కవులు జి.ఉమామహేశ్వర్, డా.యం.హరికిషన్, కళ్యాణదుర్గం స్వర్ణలత, పుల్లారామాంజనేయులు, మహేశ్వరయ్య, సుబ్బన్న, అయ్యన్న, కరేపాకుల రఘురాం, సారథి, వియోగి పాల్గొన్నారు.

❋

# తెలంగాణ సాహితి సాహిత్యోత్సవం



తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో డిసెంబర్ 17,18 తేదీలలో హైదరాబాద్ సుందరయ్య విజ్ఞానకేంద్రంలో వట్టికోట ఆళ్వారుస్వామి ప్రాంగణాన నిర్వహించిన లిటరరీ ఫెస్ట్ ఆద్యంతం కవులను, కళాకారులను, రచయితలను అలరించింది. డా॥కె.వి.రమణాచారి, ప్రముఖ కవి శివారెడ్డి, పద్మశ్రీ కొలకలూరి ఇనాక్, డా॥ఎన్.గోపి, జయధీర్ తిరుమలరావు, తెలకపల్లి రవి, మాదాల రవి, నలిమెల భాస్కర్, ఓల్గా, మువ్వా శ్రీనివాసరావు, దిలావర్ తదితరులు సాహిత్యోత్సవ ప్రారంభ సూచకంగా శాంతి పావురాలను ఎగరేశారు. ప్రారంభ సభకు తెలంగాణ సాహితి రాష్ట్ర కన్వీనర్ కె.ఆనందాచారి అధ్యక్షత వహించగా ఫెస్ట్ ఆహ్వాన సంఘ ఛైర్మన్ వినుతారెడ్డి స్వాగతం పలికారు. భూపతి వెంకటేశ్వర్లు సమన్వయం చేయగా రమేష్ రాంపల్లి ఆహ్వానం పలుకగా మహేష్ వందన సమర్పణ చేసారు. 'కవిత్వం - నేడు రేపు', 'వాగ్గేయకారుల ఆటపాట మాట' 'కథ, నవల - వర్తమాన గమనం' 'ప్రపంచీకరణ, భాషా సంస్కృతి' తదితర అంశాలపై సదస్సులు జరిగాయి. 'కవితా పఠనం' కార్యక్రమాన్ని తంగిరాల చక్రవర్తి, సునంద, కటుకోర్ఘ్వుల రమేష్, ఇందిర, గేరా, టి.దుర్గాచారి నిర్వహించారు. ప్రముఖ వాగ్గేయకారుడు గద్దర్ విచ్చేసి సభను ఉద్రూతలూగించారు. కవిత్వ చర్చాగోష్టిలో ప్రముఖ విమర్శకులు గుడిపాటి, నారాయణస్వామి, అన్నవరం దేవేందర్, కన్నెగంటి అనసూయ, షాజహాన, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, నిర్గుణ్ ఇబ్రహీం, సుమిత్రాదేవి, శారద, హిమబిందు మొదలైన వారు పాల్గొని సూచనలు, సలహాలు అందించారు. సుమిత్రాదేవి రచించిన 'నాన్న కావాలి' దీర్ఘ కవితను ముదిగంటి సుజాతారెడ్డి ఆవిష్కరించారు. మూడు వందల మందికి పైగా కవులు, రచయితలు సాహితీ ప్రియులు ఈ సభలలో తెలంగాణ రాష్ట్ర నలుమూలల నుండి విచ్చేశారు. తెలంగాణ సాహితి కార్యకర్తలు కపిల రాంకుమార్, ఖాజామొయినుద్దీన్, రాం నారాయణ, సంపటం దుర్గా ప్రసాద్, రౌతు రవి, నాగేశ్వరరావు, పల్లవి, సాహితి, వీధుల రాంబాబు, మోహనకృష్ణ తదితరులు ఏర్పాట్లను పర్యవేక్షించారు. కూరెళ్ళ శ్రీనివాస్ చిత్రించిన కవుల భావ చిత్రాలు కవులను, కళాకారులను ఎంతో ఆకట్టుకున్నాయి. 'వీర తెలంగాణ' వీధి నాటికను ప్రజానాట్యమండలి కళాకారులు కట్టా నర్సింహ నాయకత్వాన ప్రదర్శించారు. ❋



విజయనగరం జిల్లా పార్వతీపురంలో సెప్టెంబర్ 27న జరిగిన గౌరునాయుడు 'నాగలి జాడ' దీర్ఘ కవిత హిందీ పుస్తకం ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో చీకటి దివాకర్, అనువాదకురాలు ఇనుగంటి జానకి, గంటేడ గౌరునాయుడు తదితరులు



విజయనగరంలో గురజాడ గ్రంథాలయంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో నవంబర్ 18న జరిగిన కూరెళ్ళ శ్రీశ్రేయ కవితా సంపుటి 'ఎంత బాగుంటుందో' ఆవిష్కరణ. చిత్రంలో చంద్రికా రాణి, శ్రీశ్రేయ, దివిజి శంకరరావు, గంటేడ గౌరునాయుడు, పి.ఎస్. శ్రీనివాస్, మానాపురం రాజాచంద్రశేఖర్ ఉన్నారు.

# మానవతావాదుల మహాసమ్మేళనంలో ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన 14 పుస్తకాల ఆవిష్కరణ



విజయవాడలోని బెంజిసర్కిల్ వద్ద గల వేదిక ఫంక్షన్ హాలులో డిసెంబర్ 18న నాస్తిక, హేతువాద, బహుజన, దళిత, వామపక్ష, అంబేద్కరిస్టు, బౌద్ధ ఉద్యమ సంస్థల ఆధ్వర్యంలో జరిగిన 'మానవతావాదుల మహాసమ్మేళనం'లో ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన నాస్తిక కేంద్రం వారి 14 పుస్తకాల ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో ప్రముఖులు మండలి బుద్ధప్రసాద్, తెలకపల్లి రవి, చెన్నుపాటి విద్య, డా॥ జి. సమరం, కొత్తపల్లి రవిబాబు, చల్లపల్లి స్వరూపరాణి, రమాదేవి, కె. లక్ష్మయ్య, హౌరప్రసాద్, జి. విజయం, మార్ని రామకృష్ణారావు, నార్నె వెంకటసుబ్బయ్య, వరప్రసాద్, రఘుపతి రావు, షరీఫ్ గోరా, డా॥ చల్లా రవికుమార్, ఇ. రఘు, సి.ఎల్.ఎన్. గాంధీ, బీరం సుందరరావు



కాకినాడలో పి. ఆర్. ప్రభుత్వ కళాశాలలో సెప్టెంబర్ 25న జరిగిన సాహితీస్రవంతి తృతీయ వార్షికోత్సవ సభ, అద్దేపల్లి 81వ జయంతి ఉత్సవం. వార్షికోత్సవ కవితా సంపుటి ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో వుయ్యపు హనుమంతరావు, చీకటి దివాకర్, గనారా, డా॥ సి. కృష్ణ, డా॥ పి. హరిరామ ప్రసాద్, డా॥ జి. సీతారామస్వామి, గడీల శివప్రసాద్




అనంతపురంలో ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలో నవంబర్ 20న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన సాహితీ సమాలోచన సభ. చిత్రంలో ఏలూరు ఎంగన్న, ప్రజ్ఞా సురేష్, జయచంద్రారెడ్డి

## శశిశ్రీ పురస్కారం కథా సంపుటాలకు ఆహ్వానం

'శశిశ్రీ సాహిత్య పురస్కారం 2017' కొరకు కథా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు శశిశ్రీ సాహిత్య పురస్కారం కన్వీనర్ ఎస్. మస్తాన్‌వలి తెలిపారు. 2015-16 సంవత్సరంలో ప్రచురించబడిన కథా సంపుటాలను పంపవలసిందిగా కోరారు. నాలుగు కథా సంపుటాలను జనవరి 31 లోపుగా ఎస్. మస్తాన్‌వలి, జర్నలిస్టు, డో.నెం. 38/712, పి.ఎస్. నగర్, రామాంజనేయపురం పోస్టు, కడప - 516 002 చిరునామాకు పంపించాలి. ఇతర వివరాలకు 9704073044 ద్వారా సంప్రదించవచ్చును.

## శ్రీకాకుళం సాహితీస్రవంతి కమిటీ

శ్రీకాకుళంలో నవంబర్ 13న సాహితీస్రవంతి శ్రీకాకుళం జిల్లా కమిటీని ఎన్నుకోవడం జరిగింది. అధ్యక్షులుగా ప్రధాన ఆదినారాయణ, ఉపాధ్యక్షులుగా బి. నారాయణరావు, డా॥ పి. జగదీష్, చోడవరపు వెంకటలక్ష్మి, కొమ్మన పురుషోత్తం, పప్పుల వైకుంఠరావు, పొందల లక్ష్మీనారాయణ, ప్రధాన కార్యదర్శిగా చింతాడ రామారావు, సహాయ కార్యదర్శులుగా నెట్టిమి రమణారావు, పరిమళ, టేకి ఆచారి, కె. అప్పలరాములు, కె. ఎర్రన్నాయుడు, సీపాన వెంకటరావు, నిర్మాణ కార్యదర్శి వి.జి.కె. మూర్తి, కోశాధికారిగా దుప్పాడ రామకృష్ణనాయుడు ఎంపికయ్యారు.

# విజయవాడలో సాహితీస్రవంతి కార్యశాల



విజయవాడలో ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జరిగిన సాహితీస్రవంతి కార్యశాలలో ప్రసంగిస్తున్న తెలకపల్లి రవి. చిత్రంలో కె. ఉషారాణి, మహ్మద్ ఖదీర్‌బాబు, కె. ఆనందాచారి, ఈమని శివనాగిరెడ్డి, రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, కొత్తపల్లి రవిబాబు, మల్లిపురం జగదీశ్, పెనుగొండ లక్ష్మీనారాయణ.

విజయవాడలో మాకినేని బసవ పున్నయ్య విజ్ఞాన కేంద్రంలో డిసెంబర్ 11న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 'కార్యశాల' జరిగింది. ప్రముఖ రచయిత ఈమని శివనాగిరెడ్డి ఆహ్వాన సంఘం అధ్యక్షోపన్యాసం చేస్తూ ప్రపంచీకరణ నేపథ్యంలో మన భాషా సంస్కృతుల మీద పడుతున్న భిన్న ప్రభావాల గురించి ప్రస్తావించారు. వర్తమాన సాహితీ వేత్తల లక్ష్యాలనుద్బోధిస్తూ దిశానిర్దేశనం చేశారు. సాహిత్య ప్రస్థానం మాసపత్రిక ప్రత్యేక సంచిక 'స్వేచ్ఛాస్వరం'ను కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత రాచపాళెం చంద్రశేఖర రెడ్డి ఆవిష్కరించారు. ప్రముఖ సాహిత్య, సామాజిక రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి అధ్యక్షోపన్యాసం చేస్తూ, కవులపై రచయితలపై జరుగుతున్న రాజకీయ దాడిపై ఆవేదన చెందుతూనే రాజకీయ పార్టీల కతీతమైన రచయితలపై దాడి ప్రజాస్వామ్య వ్యవస్థకే గొడ్డలిపెట్టు అని పేర్కొన్నారు. రాచపాళెం కీలక ఉపన్యాసం చేస్తూ భావహరణ జరుగుతున్న తరుణమిదని, మనిషి పుట్టుకతోనే స్వేచ్ఛా జీవని, రాజ్యాంగం సైతం ఆ హక్కు తన పౌరులకు అందించిందని, రాజ్యాంగం పట్ల గౌరవం లేనివారే దౌర్జన్య ఘటనలకు కారణమవుతున్నారని పేర్కొన్నారు.

తెలంగాణ సాహితీ స్రవంతి అధ్యక్షులు ఆనందచారి మాట్లాడుతూ సాహితీకారులపై కళాకారులపై మాటల తూటాలే గాక, భౌతిక దాడులు కూడా జరుగుతున్న తరుణంలో స్పందించకపోతే భవిష్యత్తు ఎలా ఉంటుందో సూచించారు. ప్రజాసాహితి సంపాదకులు కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ- రచయితలకు, కవులను భౌతికంగా చంపడం కాదని, భావరూపంలో ఎదుర్కోవాలని, అభిప్రాయపడుతూ, భిన్న సందర్భాల్లో నిషేధాలను చర్చించారు. ప్రపంచీకరణ- కవిత్వంపై ఆచార్య మేడిపల్లి రవికుమార్ కీలకోపన్యాసం చేశారు. అలవోకగా సాగిన ప్రసంగంలో ఈ దేశంలో ప్రధాన నిర్ణయాలు అన్నీ అర్ధరాత్రే జరుగుతున్నాయనీ, ప్రపంచీకరణ నేపథ్యంలో మన ప్రమేయం లేకుండానే, సామాన్యుల జీవితాలు ఏయే దుష్ట పరిణామాలకు లోనవుతున్నాయో వివరించారు. తెలుగు కథ ప్రపంచీకరణ సదస్సులో కాలానికి నిలబడే కథలుగా, ఆ దిశగా మరెన్నో కథలు రావాల్సిన ఆవశ్యకతను రాచపాళెం వివరించారు. మహ్మద్ ఖదీర్‌బాబు - జీవితాలనుంచి కథలు ఎలా ఉద్భవిస్తాయో, కథావస్తువు ఎలా లభ్యమవుతుందో, తన కథ 'న్యూ బాంబే టైలర్స్' నేపథ్యంలో వివరించారు. తెలకపల్లి రవి మహిళల సమస్యలపై వచ్చిన కథల గురించి వివరించారు. స్త్రీలకు సంబంధించిన అంశాలతో వైవిధ్యంతో కూడిన కథలు వస్తున్నాయన్నారు. సామాజిక వివక్ష నేపథ్యంలో మల్లిపురం జగదీశ్, భాషా సంస్కృతులపై జరుగుతున్న దాడిని, వివక్షను, అంతర్గత దోపిడికి లోనవుతున్న గిరిజన తెగల జీవితాన్ని సృజించారు. ఆఖరి అంశంగా 'యువకవుల కవిత్వానుభవం'లో పాయల మురళీకృష్ణ, కెంగార మోహన్, పల్లిపట్టు నాగరాజు, మెర్సీ మార్గరెట్, నాగాస్త్ర తమ స్వీయనుభవాలను వివరించారు. అక్షరంతో అనుబంధం నుంచి కవులుగా ప్రస్థానం వైపు ఎదుర్కొన్న భిన్న అనుభవాలు సభికుల్లో ఆసక్తిని నింపాయి. 175కి మందికి పై చిలుకు కవుల, రచయితలు హాజరయ్యారు. శమంతకమణి వందన సమర్పణతో సభ ముగిసింది.

※

## సాహితీస్రవంతి నూతన కమిటీ

డిసెంబరు 11న విజయవాడలో ఎం.బి. విజ్ఞానకేంద్రంలో జరిగిన కార్యశాలలో సాహితీస్రవంతి ప్రతినిధుల సమావేశంలో నూతన కమిటీ ఎంపిక జరిగింది. సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులుగా తెలకపల్లి రవి, అధ్యక్షులుగా వొరప్రసాద్, ప్రధాన కార్యదర్శిగా సత్యరంజన్, ఉపాధ్యక్షులుగా గనారా, కార్యదర్శులుగా చీకటి దివాకర్, జంధ్యాల రఘుబాబు, కోశాధికారిగా కె. లక్ష్మయ్య. రాష్ట్ర కమిటీ సభ్యులుగా పి. కుమారస్వామి, ఎం. ప్రగతి (అనంతపురం), కెంగార మోహన్ (కర్నూలు), మస్తాన్‌వలి (కడప), చైతన్య ప్రసాద్(పశ్చిమగోదావరి), శాంతిశ్రీ, డా.రావెళ్ళ శ్రీనివాసరావు, డా|| డి. శమంతకమణి (కృష్ణ), ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు (విశాఖపట్నం), చింతాడ రామారావు (శ్రీకాకుళం) ఎంపికయ్యారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVMO2A1+6 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | kaveen |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |